శ్రీ

# గీతా సూత్ర నవతి




శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ

ఉపాధ్యాయుడు, సంస్కృతకలాశాల : తెనాలి





ప్రకాశకులు

శ్రీ పావులూరి రామారావు

శ్రీ కాలవ రామమూర్తి

వెల నాల్గణాలు




# గీతాసూత్రనవతి





గ్రంథకర్త:

ప్రకాశకులు

శ్రీ పావులూరి రామారావు
శ్రీ కాలవ రామమూర్తి

వెల నాల్గణాలు

# హృదయవీథిలో

ధర్మారాధనము చేయవలయుననెడు అభిలాష సర్వసామాన్యము. శ్రీ దేవి అనుగ్రహమున వెలువడిన ఈ నవతి ఆరాధనాంగము కాగలదని ధైర్యమున్నది. ఆత్మశ్రీప్రాప్తి కిదియొక శోధన. స్వస్వమతవాదములతో కూడుకొనిన గీతావ్యాఖ్యలనేకములున్నవి. వాని పారిభాషికతను దూరముంచి సమరస సరస సరణిలో నాంధ్రి నారాధింపవలయునని కుతూహలమున్నది. ఈ నవతి సహృదయులచే ప్రోత్సాహమిప్పించినప్పుడు స్వవిధిని నిర్వహింపగలను. మిత్రులు పాపులూరి రామారావుగారు, కాలవ రామమూర్తిగార్ల సహృదయతకు తత్వభావనకు ధర్మశ్రద్ధకును దీనిప్రకటనమొక సాక్షి. భావకులు తమ సౌహార్ద్రస్వర్ణరేఖల ఉచ్చావచభేదమును శీలించికొనుట కిట్టిది నికషోపలము. మా శ్రీ వీరరాఘవస్వామిగారు తమహృదయ స్నేహముతో నవతికి మెఱుగుపూత నిచ్చినారు. "నమోవాకం ప్రశాస్మహే" మా కలాశాలలో ఛాత్రులకిది హృదయధార్యము. యువకులకందరకు నట్లు కావలయునని తాము చెప్పవలసియున్నది.

శ్రీ మాధవరామశర్మ

శ్రీ

# గీతాసూత్రనవతి

శ్రీకృష్ణభగవానుని మధురాధరమునుండి శ్రీభగవద్గీత లోకోద్ధరణమునకై వెలువడినది. భారతయుద్ధములో అర్జునుడు వ్యాకులపాటును పొందినాడు. అట్టి ఉద్వేగభావమునకు శ్రీకృష్ణుడే హేతువు. శోకమోహములు అర్జునుని ఆవరించినవి. శ్రీకృష్ణుడు చక్కని ఉపదేశకుడు. శోకమోహముల కారణములను తెలిసికొని తగిన ఉపదేశమొనర్చినాడు. పార్థుడు శోకమోహవిముక్తుడై స్వధర్మదీక్షను స్వీకరించినాడు. గీతార్థము సుబోధమగుటకై సంగ్రహముగా హృదయమందు ప్రతిష్ఠితమగుటకై ఈనవతి ప్రారంభింపబడినది. శ్రీకృష్ణుడు పరిపూర్ణావతారము. అర్జునుడు నరావతారము. నరనారాయణులకు భేదములేదు. వారు జీవాత్మలు. అర్జునుడు ముఖ్యాధికారి కాడు. అయినను గీతోపదేశభాగ్యమును పొందగలిగినాడు. శోకమోహములు సంసారహేతువులు. అవి నశింపగా స్వరూపస్థితికలుగును. గీతాప్రయోజనము స్వరూపసంపాదనము గీతాగానము హృదయతంత్రులలో అనుగతమై నినదింపవలయునని అంతర్వాణి ప్రేరణ యొనర్పగా నిది ప్రస్తుతము.

1. ధర్మేనష్టే కులం కృత్స్నం అధర్మోఽభిభవతి 1-4

ధర్మము నశింపగా నధర్మమతిశయించును. ఆయధర్మము కులమునంతను హతముచేయును. వేదముచే బోధింపబడునది

ధర్మమనబడును. స్మృతిగ్రంథములు పురాణేతిహాసములు నన్నియు వేదార్థమునే నిరూపించుచున్నవి. మానవుడు నియతముగా కర్మ నాచరింపవలయును. ఆత్యలంగీకరించిన కర్మ ప్రవృత్తియే ఆతనికి శ్రేయము. మానవకల్పితములలో మతభేధము కలుగవచ్చును. వేదచోదితములందు విప్రతిపత్తి ఉండదు. అట్టి విహితకర్మాచరణమే ధర్మము. తద్విపరీత మగునదంతయు అధర్మము. ధర్మము కులమునకు ఆధార స్తంభము. అట్టి ధర్మము నష్టప్రాయమగునపుడు అధర్మ మతిశయించును. అధర్మ విజృంభణములో జనము పరవశమై అకృత్యముల నాచరించును. దుష్కర్మాచరణమువలన తాత్కాలిక సంతోషము కన్పడును. కాని అది శాశ్వతముకాదు. కులమునకు శాశ్వతానందమును సంపాదింప చేయునది ధర్మమే. ధర్మానను సరణమున ధర్మము నశించినట్లు కన్పడును. ధర్మము లేకపోవుటయే అధర్మచ్ఛాయ. ఆతమచ్ఛాయలు ప్రసరించినప్పుడు సర్వప్రకాశమును కప్పబడిపోవును. కావున అధర్మము కలుగకుండునట్లుగా ధర్మసేవచేయుటయే ప్రథమ కర్తవ్యము.

2. యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహితన్మే శిష్యస్తేహం
శాధి మాం త్వాం ప్రపన్నం 2-7

ఎయ్యది నిశ్చిత శ్రేయమో దానిని చెప్పవలయును. నీకు నేను శిష్యుడను, శరణాగతుడను, నన్ను శాశింపుము, అని సూత్రార్థము. అధర్మాభిమానము లేక, ధర్మశ్రద్ధతో ప్రవర్తించిన మానవునకు అంతరంగ ప్రభావమున శ్రేయః

కాంక్ష కల్గును. ఇహలోకమునను పరలోకమునను పొందబడు నట్టి విషయోప భోగ సుఖములు ప్రేయఃపదముచే చెప్పబడును. ఆత్మ సాక్షాత్కార రూపమైన పరమనిశ్శ్రేయసము శ్రేయః పదముచే చెప్పతగినది. ధర్మాభిమానికి ధర్మసేవలో అంతరంగము పరిపక్వమగును. అట్టి పరిపాకానుసారముగా శాశ్వత సుఖాకాంక్ష కల్గును. ప్రాణిమాత్రమునకు ఇది సామాన్యప్రకృతి. ధర్మతత్పరునియందు అది ఉద్బుద్ధమగును. కాని సాంప్రదాయికమగు విజ్ఞానమునుపొందుటకై సాత్త్విక హృదయ మభిలషించును. అందువలన విషయవిరాగముకల్గి సద్గురు సన్నిధానమందు శిష్యుడై ప్రవర్తింపవలసియున్నది. గురువుతప్ప శ్రేయోమార్గమందు వేరొకగతిలేదని అవశ్యము ప్రపన్నుడుకావలయును. గురువచనానుసారమున ప్రవర్తింప వలయును. అంతియేకాక యథేచ్ఛగా ఆజ్ఞాపింపవలసినదని గురుపాదుని ప్రార్థింపవయులను. అట్టి అర్హతాసముపేతుడైన ప్పుడు శ్రేయస్సును పొందవలయుననెడి ఉత్కటమగు ఇచ్ఛ జనించును. కాగా గురుసంప్రదాయానుగతమైన ఆత్మవిద్య నిశ్శ్రేయసప్రదమని తెలియవలయును.

### 3. ఆగమాపాయినోఽనిత్యాన్ తాంస్తితిక్షస్వ 2-14

రాకపోకలు కలవన్నియు అనిత్యములు. వానిని సహింపవలయును. ఇది భగవానునివిధి వాక్యము. నిలుకడలేని ధర్మములు వాస్తవములుకావు. లోకములోని విషయములను సంబంధించి ఉత్పన్నములగునవి స్థిరములుకాజాలవు. శీతోష్ణ

ములు సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములన్నియు నిలుకడ లేనివై రాకపోకల ధర్మములతోనున్నవి. ప్రపంచవిషయ మనిత్యమగుటవలన తత్సంబంధభావములుకూడ నట్టివే. వాటిని సహించుటను అభ్యాసపదమం దుంచుకొనవలయును. సుఖ దుఃఖాదులు సంపాదింప చేయునట్టి విషయములం దభిమాన మున్నచో రాగద్వేషములు దయించును. తన్మూలకముగా సుఖ దుఃఖాదులుకల్గును. కావున అభిమానత్యాగమవసరము. అన్ని అనర్థములకును మూలముగా శోక మోహాములుండును. అవి యును నిలుకడకలవికావు. వానినికూడ అనుభవమున సహిం చుటయే క్షేమప్రదము. ద్వంద భావములను విరుద్ధములుగా చూచువానికి బాధకల్గును. సమముగా పరిశీలించు మానవుడు ఖేదమును పొందడు. సమదృష్టి లేకపోవుటయే అజ్ఞానము. తితీక్షవలన అజ్ఞానమును దాటవచ్చును. కావున విషయాభి మానములేక సమానభావముతో ప్రవర్తించుటయే కర్తవ్యము. వీని కతీతమైన ఆత్మయందు నిష్ఠఉన్నచో వీనిని సహింప వచ్చును. స్వాత్మ ప్రకాశములో విరుద్ధ భావములు అన్నియు అవిరోధమున నుండును. ఏకరూపమున ప్రకాశించును. కావున శోక మోహాదుల సహించుటయే ఆవశ్యకము.

4. నాసతో విద్యతే భావః నాభావో విద్యతే సతః 2-16

అసద్వస్తువున కునికిలేదు. సద్వస్తువునకు నాశములేదు. ఆత్మ సద్రూపము. అది ఒకప్పుడుండి వేరొకప్పుడు నశించునది కాదు. ప్రపంచమునకు సత్తలేదు. అది అసద్రూపము. సదసద్వ

స్తువులయొక్క స్వభావము నవశ్యము తెలియవలయును. అట్టి వివేకముకల్గినపిమ్మట అసద్వస్తువును పరిత్యజించుటయు సద్వస్తువునే స్వీకరించుటయు కర్తవ్యముగా అవభాసించితీరును. అసద్వస్తువు క్షణవిలాసముతో భాసించును. నానావిధ చిత్రవిచిత్ర భావములందుండును. ప్రపంచవిలాసమంతయు అట్టిదియే. ఈక్షణభంగురత్వమును తెలుసుకొని మానవుడు వానియందు వ్యాసక్తుడుకారాదు. సద్రూపమును తెలిసినపిమ్మట ఆస్వభావమందే పరినిష్ఠితుడై ఉండవలయును. నిత్యసిద్ధమై స్వాత్మగానుండు సద్వస్తువు చిత్రవిచిత్రముగానుండదు. కాని అనేకచిత్ర విచిత్రభావములకు సత్పదార్థమే మూలకందము. దానినాధారముచేసికొని అసత్ప్రపంచము చిత్రమయమై భాసించుచున్నది. చిత్రవిచిత్రభావములకు చిత్రత్వవిచిత్రత్వమును సంపాదించునట్టిది సత్పదార్థమే. అదియే ఆత్మ. అదియే బ్రహ్మ. ఇట్టి ఈబోధలో మానవునకు బ్రహ్మతాత్పర్యమే ఉండవలయును. ప్రపంచతాత్పర్యము పరిత్యాజ్యము అనెడు ముఖ్యభావము గోచరించును.

### 5. అంతవంత ఇమేదేహాః 2-18

ఈ దేహము లన్నియు అంతము కలవియే. వీని కెన్నడును స్థిరత్వము లేదు. బాల్యదేహము యౌవనమందుండదు. యువదేహము వార్ధకమునలేదు. వచ్చెడి జన్మలో ఈదేహముండదు. ప్రతిక్షణమునను దేహమునకు వృద్ధిహ్రాసము లున్నవి. కావున నిలుకడలేనివని అర్థము పర్యవసన్నమగును.

దేహము అనేకావయవములచే పరిశోభితమై ఉండును. అవయవ సహితముగా నుండునది అనంతముకాదు. మానవదేహము అంతసహితమగుట లోకమందు స్పష్టము. దేహమునకు దేహాకారత్వము పోవుట విదితమైన విషయము. ఇట్లే లోకాంతరమున పొందబడు దేహములుకూడ అనిత్యములని తెలియవలయును. స్వర్గ శరీరమును అనంతముకాదు. పుణ్యనాశమున ఆదేహమునకును నాశమున్నట్లు స్పష్టమే. రసౌషధులచే దేహసిద్ధిని పొందినను దేహము అనంతము కాజాలదు. కావున ఎట్టి సిద్ధయోగి దేహమైనను నిలుకడలేని అసద్భావములతో కూడుకొన్నదై నశించిపోవుచున్నది. కావున దేహాభిమానముచితముకాదు. ఈదేహమందు దేహి అనబడు వాడొకడు కలడు. నిఖిల దేహములందును దేహి ఒక్కడే. సూర్యుడొక్కడే అనేక హ్రదములందు ప్రతిబింబించు చున్నాడు. విద్యుద్ధార ఒక్కటియే. అనేక దీపగుళికలలో ప్రకాశించుచున్నది. సూత్రమొక్కటియే. అనేక మణులందు అనుగతమైయున్నది. దేహము లనంతములైనను దేహి ఒక్కడే. దేహములందు అంతవత్వమున్నను దేహి అంతరహితుడు. కావున దేహాభిమానమును దూరము చేయవలయును. దేహియందభినివేశము అధికము చేసుకొనవలయును.

## 6. అజో నిత్యః శాశ్వతోయం పురాణః 2-20

దృశ్యమాన నిఖిలదేహములందు కూడుకొనినదేహి అజుడు నిత్యుడు శాశ్వతుడు పురాణుడు. ఉత్పత్త్యాది వికారములేవియు

ఆతనియందు లేవు. సర్వకాలములందును ఆత్మ అవభాసించును. సార్వకాలికమగు ఆ ఆత్మసత్త ఏవిధమునను ప్రతిహాన్యమానముకాదు. ఆఆత్మ ఒకప్పుడుండి ఒకప్పుడు లేకపోవుట లేదు. అనాదికాలముననున్న ఆ ఆత్మయే నేడునుకలదు. వచ్చు కాలమునకూడా అది ఉండునదియే. పురాణమైన ఆ ఆత్మభావమునకు ఎన్నడును జీర్ణతకల్గదు. నిత్య శాశ్వతపదమును పొందవలయునని మానవున కభిలాషఉండును. ఆత్మ నిత్యపదమగుటవలన పరమప్రాప్యము. అందుచే స్వాత్మకై సర్వమానవులు శ్రద్ధారాధన చేయవలయును.

### 7. జాతస్య హి ధ్రువో మృత్యుః 2–27

భ్రాంతచిత్తులగువారు ప్రపంచమునందు భాసించునట్టి భావములయొక్క యథార్థభావమును స్పష్టముగా తెలియజాలరు. తమ అసమర్థప్రజ్ఞతో కూడుకొనిన చక్షురాదులకు ప్రపంచ వస్తువు లేవిధమున అవభాసించునో వానినట్లే గ్రహింతురు. అది సముచితముకాదు. పైత్యరోగికి సూర్యుడు పచ్చగానుండవచ్చును. కాని అది సత్యముకాదు. అజ్ఞానులు దేహాదులం దవభాసించునట్టి విశేషము నాత్మయందు ఆరోపింతురు. దేహముత్పన్నమైనట్లు గోచరించు టచే ఆత్మయు ఉత్పన్నమని భావించుచున్నారు. అట్లు భావించుచుకూడా ఆవృత్తి ప్రభావమువలన లోకము ఖేదముపొందుచున్నది. పుట్టినవస్తువునకు మృత్యువు ధ్రువమే. పుట్టినది అట్లే ఉండదు. అవయవముల వృద్ధిహ్రాసము పొందును. ఆ ఉపచయాపచయములే దాని

మృత్యువును సూచించును. జన్మకలదానికి మృత్యువున్నట్లుగా మృత్యువుకలదానికి జన్మయుకలదు అనియే ఆదృష్టియందవశ్యమంగీకరింపవలసియున్నది. ఆత్మ అజాతమైనను జాతమని యనుకొనినను మానవుడు శోకింపవలసిన యవసరము లేదు. నిత్యమగు ఆత్మవిషయమై శోకమేమాత్రమును అవసరముకాదు. ఆశ్రయముగా కన్పడుశరీరము హతమైనను ఆత్మకు హానిలేదు. ఒకే ఆత్మ అనేక శరీరముల ధరించును. జీర్ణవస్త్రమును విడిచి మానవుడు శుద్ధవస్త్రమును స్వీకరించునట్లు ఆత్మ జీర్ణదేహములను విడచి నవదేహములను పొందును. పంచభూతములవలన ఎట్టి వికారమును ఆత్మకుకల్గదు. ఆత్మ యొక్క ఉత్పత్తిపక్షమున మరణ జననాదులు అవశ్యంభావులే కాబట్టి శోకమున కవకాశము లేదు. జననమరణములు అపరిహార్యములు. పదార్థములయొక్క అపరిహార్యత్వమును పరిశీలించి ప్రవర్తించు మానవుడు శోక మోహాంబుధి నిమగ్నుడు కావలసినయవసరము లేదు. ప్రాపంచికభావము లేవియుకూడా నిత్యములుకావు. అచట పరిదేవన మనవసరము.

## 8. దేహీనిత్యమవధ్యః 2-30

దేహధర్మమును దేహియందారోపించుట సముచిత పక్షము కాదు. దేహి దేహములకు ఎంతయో అంతరమున్నది. దేహికెన్నడు నాశము లేదు. ఎట్టి దేహమందును ఆదేహినశింపడు. కావున దేహగత ధర్మము లేవియు దేహియందు లేవనియే తెలియవలయును. దేహియొక్క అవధ్యత్వమును భావించి

సచో ఎవనికిని ఆత్మయందు హానికల్గుననెడిబుద్ధి ఉదయింపదు అందువలన శోక మోహములుండవు. దేహదేహి భావమును ఇట్లువలోకనముచేసి మానవుడు నిస్పృహతో అనాసక్తితో తన కర్తవ్యమును పాలింపవలయును. కర్తవ్యమున కెన్నడును పరాఙ్ముఖుడు కారాదు. అది పాపహేతువు. కావున ఆత్మ విజ్ఞానప్రణతి సర్వసముచితము.

9. స్వల్పమప్యస్య ధర్మస్యత్రాయతే మహతోభయాత్ 2-40

ఆత్మవిజ్ఞానమే పరమధర్మము. తత్సేవనమే సముచితము. ఆ ధర్మము నేమాత్రము సేవించినను మహాభయము తొలగి పోవును. సత్యమగు ఆత్మదృష్టి లేకపోవుటయే భయముగా చెప్పబడుచున్నది. ఆత్మాతిరిక్తమగు పదార్థ మున్నదని తలచుటయే భయహేతువు. ఆత్మ యథార్థత్వమును భావించినప్పుడు ఆభయమున కవకాశము లేదు. ఆత్మా తిరిక్తమగు ద్వితీయ వస్తువు వలననే భయ ముదయించు చున్నది. ప్రపంచమంతయు మహాభయరూపము. ఈ ప్రపంచ సాగరమున మానవుడు విభ్రాంతచిత్తుడై ఆత్మదృష్టిని మరచి పోవుచున్నాడు. ఆత్మధర్మసేవనమువలన తత్పరత్వమువలన ప్రపంచదృష్టి నశించును. ప్రాపంచికదృష్టి నశించుటయే ఆత్మ దృష్టి. ఇట్టి నిరూఢభావములో ప్రపంచ విలాసమంతయు నశించిపోవును. ఆత్మసేవనమే రక్షణమొనరించును. కావున మానవు డందే ప్రవర్తింపవలయునని సూచింపబడుచున్నది.

## 10. నిస్త్రైగుణ్యోభవ 2-45

నిశ్చయాత్మకమైన ప్రవృత్తి మానవునకపేక్షితము. స్థిరబుద్ధి ఉన్నప్పుడే మానవుడు గమ్యమునుపొందును. బుద్ధియందు నిశ్చయములేనప్పుడు విప్రకీర్ణతఏర్పడును. అనిశ్చయమగు తత్వము హానికరము. ప్రాపంచికవిషయములన్నియు సత్వ రజస్తమోగుణములయొక్క తరతమభావమందు అనుగతము లగు ధర్మములతో కూడుకొనిఉన్నవి. సాత్వికములు రాజ సములు తామసములు అయిన ఆభావములవీధిలో విహరించు మానవునకు నిశ్చయముకాని విముక్తికాని కల్గదు. కావున నిస్త్రైగుణ్యభావము సంపాదించుట ఆవశ్యకమైయున్నది. గుణా త్మకమైన తత్వమంతయు కర్మవాదములతో కూడుకొని యున్నది. అచట మానవుడు కర్మఫలము లాకాంక్షించును. భోగైశ్వర్యములనుకోరి నష్టచేతసుడగును. కావున బుద్ధి హతమై పోకుండునట్లుగా సాత్వికరాజస తామసభా వములందు కూడుకొనక వాని తటస్థవృత్తితో మానవుడు ప్రవర్తింపవలయుట ఆవశ్యకమైయున్నది. ఈసూత్రము గుణా తీతమగు అవస్థను స్వీకరించుచున్నది. ఆ అవస్థయే సమాధి ప్రజ్ఞకనుకూలము. సమాధియందే ఆత్మవేదనమున్నది. అప్పుడే స్వరూప సాక్షాత్కారముకల్గును. గుణభావముల కతీతత్వము పొందుటయనగా నిత్యసత్వస్థితిగా అర్థముచేసుకొనవలయును. ఈ నిస్త్రైగుణ్యమార్గమునందు విహరించునాతడు ద్వంద్వా తీతుడగును. లేదా వాదములలోని ఫలము ఈమార్గగామికిని సులభము.

## 11. కర్మణ్యేవాధికారస్తే 2-47

నిస్త్రైగుణ్యమార్గమును పొందుటకు అనేకవిధములగు కర్మలను వేదచోదితములగువానిని మానవు డాచరింపవలసి యున్నది. కర్మయొక్క స్వరూపమును దెలుసుకొని మానవు డచట ప్రవర్తించవలయును. కర్మ ఫలజనకము. అది ఎన్నడును వ్యర్థముకాదు. కర్మకరణమందు మానవునకు క్లేశమున్నది. ఫలానుభూతిలో మానవుడు సుఖమునుచూచును. ఒకప్పుడు సుఖాసక్తుడై ఫలమునాకాంక్షింపవచ్చును. కాని క్లేశమును సహించుటయందే ఆత్మవికాసమున్నది. అందువలన కర్మయందే మానవుడు ప్రవర్తింపవలయును. అచటనేవానికధికారమున్నది. కర్మఫలమును మానవు డాకాంక్షింపరాదు. తానాచరించు కర్మఫలమును సంపాదించునట్టి శక్తికలది కాకపోవచ్చు. మానవునకు కర్మ కర్తవ్యమేకాని తత్ఫలము ఆకాంక్షణీయముకాదు. ఫలప్రదానము ఈశ్వరాధీనము. దానికి మానవుడు నియామకుడు కారాదు. కర్మలందు కూడుకొనిన ఆనియతానుసరణము మానవునకు ఉన్నతపదమును సంపాదింపగలను. వేదచోదితములైన కర్మల నాచరించుటలోమాత్రము మానవు డధికృతుడై యున్నాడు. అందువలన ఫలాసక్తి ఉండరాదు. కర్మ శ్రద్ధను విడువరాదు. కర్మఫలము విషయమై తాను హేతువు కారాదు. అకర్మయం దాసక్తుడు కారాదు. పై వచోనిగుంభితమైన ఈ అర్థమును మానవుడు గ్రహించ వలయును.

## 12. యోగస్థః కురు కర్మాణి 2-48

కర్మనిష్ఠితుడై కర్మల నాచరింపవలయును. అదియొక యోగము. ఆ యోగస్థత్వము అవస్యమపేక్షితము. యోగ నిష్ఠ ఉన్నప్పుడు ఫలసంగముండదు. ఫలసిద్ధిలోకాని అసిద్ధి లోకాని అభిలాష ఉండదు. ద్వేషముండదు. లాభాలాభము లందు సమభావ ముండుటయే యోగము. ఎచటనైన సమభావ ముదయింప వలసి వచ్చినచో ఆత్మారాధన మచట అవశ్యము కూడుకొనును. ఆత్మోన్ముఖమైన యోగస్థితి నియతవిహిత కర్మనిష్ఠను కల్గచేయును. నిష్ఠా యుక్తుడై ఉత్తమకర్మల నాచరించినప్పుడు ఆత్మప్రత్యయ ముదయించును. అట్టి నిశ్చయముకల్గగనే స్వాభావికసంస్కా రము ననుసరించి కర్మగతిని మానవుడు దాటిపోడు. ఇట్టి పరి స్థితియే ఇచటసముద్దిష్టము. ఆత్మవిశ్వాసమునకై ఉత్తమచిత్త సంస్కారముకావలయును. అట్టి ఆ చిత్తసంస్కారము అనా సంగముతో కర్మలచేయుటవలనగాని కల్గదు. ఆకర్మనిష్ఠను యోగముగాభావించి ప్రవర్తించుటవలననే మానవునకు కర్మ స్థైర్యముకల్గును.

## 13. బుద్ధినాశాత్ప్రణశ్యతి 2-63

యోగస్థితుడై కర్మల నాచరించినప్పుడు ఆసక్తిరహితుడై నప్పుడు నిశ్చలసమాధి నిష్ఠకల్గును. ఆసమయమున ఆత్మా రాముడై ప్రకాశించును. సుఖదుఃఖాదులు ఆతని వ్యథపెట్టవు. గుణమయప్రకృతికి పరతంత్రుడై మానవుడెంతగా ప్రయత్నించి

నను గుణస్వభావమువలన ఇంద్రియప్రకోపము కల్గుచుండును. ప్రమథించుస్వభావము కల్గిన ఇంద్రియసమూహము మానవుని మనస్సును బలవంతమున నిరోధించును. వానినన్నిటిని నియమించుటయే కర్తవ్యము. నిశ్చలమగు బుద్ధితత్వమే అపేక్షింపబడుచున్నది. బుద్ధినాశమువలన ఆత్మనాశముకల్గును. బుద్ధి సర్వప్రధానము. దానితత్వమందు ఏమియు ప్రమాదపాటుండరాదు. ప్రాపంచికములైన ఆయావిషయములను నిరంతరము ధ్యానించునప్పుడు వానియందాసక్తికల్గును. ప్రజలకును విషయాసంగమువలన కామముదయించును. కామక్రోధసమ్మోహములు అవశ్యముగా యొకదానివెంట ఒకటి కల్గును. వ్యామోహ మావరించినపుడు స్మృతియంతయు నశించిపోవును. స్మృతిభ్రంశము కల్గినచో బుద్ధి సర్వనాశముపొందును. బుద్ధి వినష్టమైనప్పుడు ఆత్మ హానికల్గుచున్నది. కావున బుద్ధినాశము కల్గకుండునట్లుగా ప్రయత్నింపవలసియున్నది. తన ఇంద్రియములందు రాగద్వేషాదుల కవకాశము కల్గనీయక ఆత్మవశీకారమును సంపాదింపవలయును. అదియే ప్రసాదమును సంపాదించును.

## 14 అశాంతస్య కుతః సుఖం 2-66

మనఃప్రసాదము కల్గినప్పుడే దుఃఖహానికల్గును. సర్వదుఃఖములు నశించిపోగా ఆత్మవిషయమగు భావన అతిశయించును. నిరంతరము మానవునకు అట్టి తీవ్రభావన సముచితము. సామాన్యస్వభావమందు వ్యాప్తమైయున్న మనస్సు అప్పటికప్పుడు ఏదో

ప్రసాదమును పొందినట్లు అనుభవముండును కాని అది సహజమైన ఆత్మానుభవముకాదు. విషయధ్యానములో మనస్సునకు ఒకప్పుడు వికాసరూపమగు అవస్థ కల్గవచ్చును. ఆవికాసము సాపేక్షము. సాపేక్షవికాస మెప్పుడును స్థిరముకాదు. ఆత్మాధీనముగా ప్రసరించినట్టి చిత్తవృత్తియందు నిరపేక్షమైన ప్రసాదముదయించును. ఆప్రసన్నతలో ఏవస్తువును అవలంబముగా ఉండదు. నిరవలంబమైన అట్టి చిత్తప్రసారములో పరమశాంతి ఉదయించును. అట్టి శాంతియున్ననే అత్మానంద మనుభవింపబడును. శాంతి లేకపోయినచో సుఖము కల్గదు. అశాంతునకు సుఖములేదు. ఉద్వేగపాటు లేనట్టి ఇంద్రియవృత్తులందే సుఖమనుభవింపబడును. అట్టి అనుద్వేగము శాంతభావమందే ఉదయించును. ఆయావిషయముల ననుసరించి ధావనమొనర్చునట్టి ఇంద్రియములను మనస్సు అనుసరించి నప్పుడు ప్రజ్ఞాలోపము కల్గును. వీని అన్నిటియొక్క నిగ్రహమందు ప్రజ్ఞ ప్రతిష్ఠితమై ఉండకలదు.

### 15. స శాంతిమాప్నోతి నకామకామీ 2-70

నియతవిధానాను సరణముగా యుక్తాచరణమొనర్చిన మానవునకు ప్రాపంచికములైన వ్యవహారములలో ఆసక్తియుండదు. అత్మముఖులు కానట్టి మానవులలో ఏ ఏ విషయములు సర్వవిధముల అనుభవింపబడుచుండునో వానియందన్నిటను సంయమ దీక్షాతత్పరులైన ప్రజ్ఞాశీలురు విముఖులుగా నుందురు. సామాన్యమానవులకు అగోచరముగా నుండునట్టిఆత్మలోకము

నందు ఆతడుసర్వసమయములందును జాగరూకుడైయుండును. సర్వకామములును ఆతనియందు ప్రవేశముపొంది ఆత్మకామత్వమును గ్రహించును. అట్టియాతడు ఆత్మవేదనమువలన ఉత్తమశాంతిని అనుభవించి పరితృప్తుడు కాగలడు. సర్వకామములను విడచి ఆత్మకాముడై ప్రవర్తించు మానవుడే శాంతిభాజనుడగును. కామకామి అగువాడు శాంతిని పొందజాలడు. విషయారాధనమున అల్పసుఖమేకాని ఉత్తమసుఖము కల్గదు. ఆపాత మధురములైన వానియందు ప్రవర్తించి పాతుడగుట సముచితము కాదు. మమాహంకారములను పరిత్యజింపవలయును. ఆసమయముననే ఉత్తమశాంతి ఉదయించును.

## 16. బ్రహ్మనిర్వాణమృచ్ఛతి 2-72

ఉత్తమశాంతికి యోగ్యమగు నిష్ఠకు గుణాతీతభావమునకు ఆత్మప్రాప్తియే ఫలము. ఆత్మయే బ్రహ్మ. బ్రహ్మయేస్వాత్మ. స్వస్వరూప ప్రాప్తియే బ్రహ్మనిర్వాణము. శుద్ధచైతన్యభావమునకు అవిద్య ఆవరించినది. అవిద్యావరణమువలన జీవుడు జ్ఞానపథము ననుసరించినట్టి ఆత్మచింతనమువలన ఆత్మచింతనకై అర్హతను సంపాదించునట్టి యోగ్య కర్మానుష్ఠానమువలన చైతన్యమునకు ఆవరణముగా ఉన్న అవిద్యతొలగిపోవును. మాయికమైన వస్తువు స్థిర ప్రతిష్ఠమై ఉండజాలదుగదా! యోగరతుడై ప్రవర్తించు నప్పుడు చిత్తప్రసార ముదయింపగా పరమశాంతికల్గుట సంప్ర

దాయధర్మము. బ్రహ్మనిర్వాణము కల్గుటలో ఆత్మవిచారణము సన్నిహితసాధనము. ఆయా విహితకర్మానుష్ఠానము పరంపరా హేతువు. అర్హతానుగుణముగా సాధకుడు వాని వాని ననుసరింపవలయును. రెండువిధానములకును బ్రహ్మనిర్వాణమే లక్ష్యము. ఇట్టి ఆత్మవేదనముకల్గినప్పుడు అమితానంద ముదయించును. అనాదిగానున్న అజ్ఞానము తొలగి పోవుటయే బ్రహ్మప్రాప్తి. అజ్ఞాన మొకప్పుడు నశించినచో మరల అది ఆవరింపదు. కావున బ్రహ్మప్రాప్తి పునరావృత్తి రహితమైన శాశ్వతానంద ధామమని తెలియవలయును. ఇదియే నిరంతర నిశ్శ్రేయసము. సర్వప్రాణులును దీనినే ఉద్దేశించుచున్నవి. అర్జునుబుద్ధిలో కూడుకొనిన శ్రేయస్సుకూడ ఇదియే. ఇట్టి ఈబ్రహ్మనిష్ఠ కల్గుటకు కృష్ణానుసరణము సాధనము.

## 17. కర్మముక్తసంగః సమాచర 3-9

బ్రహ్మప్రాప్తికై జ్ఞానమార్గము కర్మమార్గమును ప్రసిద్ధమై యున్నది. మానవునకు కర్మాచరణము లేకపోయినచో ఉత్తమనిష్ఠ కల్గదు. కేవలము కర్మసన్న్యాస ముచితముకాదు. స్వభావ గుణముల ననుసరించి అవశుడై కర్మనొనరించును. ముక్తసంగుడై కర్మనవశ్య మాచరింపవలయును. మనోనియమములేక బాహ్యమునకు నియమముగా ఉన్నట్లుప్రవర్తించువాడుమిథ్యాఽచారుడనబడును. మనస్సులో ఒకటి ఆచరణలో వేరొకటిని ఉండుట ఉచితముకాదు. మనోవాక్కాయములతో

ఏకవిధానమునే అనుసరింపవలయును. మనో నియమానుసారముగా కర్మలందు ప్రసక్తుడగువాడు విశిష్టుడుగా ఎన్నబడును. కర్మచేయకపోవుట ఉచితముకాదు. కర్మాసక్తిలేక ప్రవర్తించుటయే సముచితము. అకర్మవలన శరీరయాత్రయు సిద్ధింపదు. ఆత్మవిషయికమగు కర్మ ఏదియు బంధకముకాదు. సామాన్యముగా కర్మలు ఫలసహితములే కావున మానవుని ఫలముతో బంధించుచున్నవి. ఫలానుషంగము కలవాడై ఏదియేని మరల నాచరించును. అట్టి పునఃపునర్విధానములో బంధనవశుడగుట ప్రసిద్ధమే అయినప్పటికి ఆత్మకర్మ కర్మకాదు. అది ఎన్నడును బంధహేతువు కాజాలదు. కావున సంగరహితుడై కర్మలందు ప్రవర్తించుట ఆత్మికమైనకర్మ నిర్విషయమనియే చెప్పవచ్చును. నిర్విషయమగునది బంధనముకాదు. కావున నిస్సంగభావముతో కర్మలచేయుటయే ఉచితము.

### 18 నబుద్ధిభేదం జనయేత్ 3-26

మానవులందును తరతమభావము నానావిధముననుండును. అందరును ఒకే సూత్రము ననుసరించి ప్రవాహానుగతులు కాజాలరు. వారివారి అర్హతానుసారముగా ఆయావిధులను అనేకవిధములుగా గ్రహింతురు. అనేకవిధములైన కర్మలందు ప్రవర్తింతురు. ఫలాకాంక్ష కల్గి కర్మలందు ప్రవర్తింతురు. అనేకదేవతలను ఆరాధింతురు. ఆత్మవేదనము కలమానవుడు అట్టివారలకు భేదజ్ఞానమును కల్గచేయరాదు. వారి బుద్ధులందు భిన్నత్వమును ఆపాదింపరాదు. తమతమ

కర్మయందు ప్రవర్తించి ప్రతిమానవుడు ఆత్మవికాసమునే పొందును. కొన్ని దూరసంబంధము కలవియై ఉండవచ్చును. అంతమాత్రమున అది అతనికి పరిత్యాజ్యముకాదు. యోగ్యతా సంపదయొక్క విశేషమునుబట్టి ఆయావిధులు అనేకరూపములను తాల్చుచున్నవి. యేక్రియావిశేషమైనను పరంపరారూపముననైన ఆత్మ సమన్వయము పొందకమానదు. కావున బుద్ధులందు యేదియేని ఒక నిరూఢపద్ధతి స్వీకృతమైయున్నప్పుడు ఆమార్గము తొలగిపోవునట్లు చేయుట సముచితమనబడదు. బుద్ధి వృత్తులకు ధారారూపత్వము సిద్ధమైనప్పుడు భిన్నభావములను మొలకలెత్తింపచేసినచో ధారావాహికత నష్టప్రాయమగును. అందువలన భిన్నధార కూడుకొనగా బుద్ధి వృత్తులలో నిలకడ నశించిపోవును. ఎట్టివిధానమందైనను మనోధారకు అనుగతి ఉద్దేశింపబడుచున్నది. ఇదివరలోని చిత్త సంస్కారమునుబట్టి క్షుణ్ణమైయున్న మార్గమందు ప్రసరించునట్టి మానవుని భిన్నగతుని చేయరాదు. సంప్రదాయానుగతమైన ఏకమార్గమును నియతముగా అనుసరించునపుడు బుద్ధి వృత్తులలో నిశితత్వము కల్గును. ఆనైశిత్యమే కాలక్రమమున వారలకు క్షేమమును సంపాదింపచేయగలదు.

## 19 గుణాగుణేషు వర్తంతే 3-28

మానవుడు గుణమయుడు. గుణానుగతమైన స్వభావము ఆతనిలో ప్రసరించును. తదనుసారముగానే ప్రవర్తించును. ప్రకృతి పరతంత్రుడై కర్మలను ఒనరించును. ప్రతికర్మయు

ఆయాగుణములచే నిర్వర్తింపబడుచున్నది. అయినను అజ్ఞుడైన మానవుడు అహంకారవిమూఢుడై కర్తృత్వభోక్తృత్వములను తనయందారోపించుకొనుచున్నాడు. అట్టి సమారోపము వలన ఆతనికి భ్రాంతి అతిశయించుచున్నది. ప్రపంచ పరతంత్రుడగుచున్నాడు. తత్త్వవేత్తయగువాడు గుణకర్మవిభాగములను తెలుసుకొని గుణకర్మలందు ఆసక్తుడై ప్రవర్తింపడు. ఆయాగుణములు గుణస్వభావమందే కూడుకున్నవని ఆతడు చలింపడు. ఆత్మకు గుణములకన్న అతిరిక్తభావమును పరిశీలించును. అట్లు విభక్తముగా పరిశీలించునప్పుడు గుణవిశేషము లేవియు ఆతనినంటవు. గుణాత్మవివేకము తెలిసినప్పుడు అసంగభావమే అతిశయించును. అట్టి యాతడే కృత్స్నవేత్త. అట్టి స్థితిని అందరును అందుకొనజాలరు. ఆస్థానమునుపొందిన మహనీయులు ఇతరులను అసర్వ్హలగువారిని చలింపచేయరాదు. తత్త్వసాక్షాత్కారము కల్గిన మహనీయుడు అహంమమభావములలో నుండడు. ఆతనికి స్వపరవిభాగము లేదు. అనాసక్త భావముతో కర్తవ్యములను పాలించును. తత్త్వవేదనము సిద్ధమగుటకై గుణస్వభావము అవశ్యముగా తెలియవలసియున్నది. ఆపరిశీలనము వలన తత్త్వబుబుత్సు ఉపశమించును.

## 20. స్వధర్మే నిధనంశ్రేయః 3-35

ఒక్కొక్క జీవునకు ఒక్కొక్క కర్మసృష్టి నియమితమై యున్నది. జన్మాంతరములోని విశేషములే ఆజీవునకు అట్టి ఉత్పత్తిని కల్గచేయుచున్నవి. తనఉత్పత్తికి అనుగుణమైనకర్మయే

ధర్మ మనబడును. నియత ధర్మమునకే స్వధర్మమని పేరు. స్వధర్మ సంబంధము శ్రేయః ప్రథమము. ఎచ్చటనైనను ధర్మములందు వ్యత్యాసములేదు. ధర్మస్వరూపము నంతయు నొకటే. ధర్మసేవనము చేయువారిలో కల స్వభావ భేదమునుబట్టి ధర్మమును భిన్నముగా గ్రహింతురు. అప్పుడే స్వధర్మమని పరధర్మమని భేదజ్ఞానము కల్గుచున్నది. ధర్మానుగుణమైన అంతరంగ ప్రవృత్తి లేకపోయినచో ధర్మములందు న్యూనాధిక భావము లుదయించును. అందువలన సంప్రదాయానుగతముగావచ్చుచున్నవి చిరాభ్యస్తములైనధర్మములందు వైగుణ్యము భాసించును. ఇతరధర్మము ఉత్తమగుణములు కలదిగా భాసించును. అట్టియపుడు అంతరంగమున చలనముదయించును. ఆచలనానుసారముగా తన ధర్మమును విడుచుటయు పరధర్మమును స్వీకరించుటయు ఉండవచ్చును. అది హానికరము. ధర్మములందు అసలు న్యూనాధికభావమే సముచితముకాదు. స్వపరవిభాగమే యుక్తముకాదు. విగుణమని సుగుణమని అనుకొనుట పొరపాటు. లోభాకృష్టమైన హృదయమునకు సుగుణ దుర్గుణభావములుదయించును. ధర్మారాధకున కట్టిదుండరాదు. తనబుద్ధిస్వభావమునుబట్టి తన ధర్మమును విగుణముగా భాసించినను అట్టి స్వధర్మానుసరణమే శ్రేయస్కరము. పరధర్మము నెంతగా ఆరాధించినను శ్రేయస్సు కలదనలేము. స్వధర్మానుష్ఠానమున ఫలమును పొందక మానవుడు హతుడైనను యుక్తమే. పరధర్మముమాత్రము భయావహము. విహితధర్మమును పరిత్యజించినప్పుడు అందు

కొంతస్వీకారము శ్రేయస్కరము కాజాలదు. అట్టిచో అనేక దోషములు వాటిల్లును. అవి శ్రేయోమార్గమునకు నిరోధకములు. విహితదేవతను పరిత్యాగముచేసి వేరొకదేవత నారాధించునప్పుడు దేవతాపరిత్యాగదోషము సంప్రాప్తమగును. అందువలన రెండిటికిని చెడినవాడగును. కాబట్టి విహితమైన తనధర్మమందు నిధనము పొందినను యుక్తమే. ఆపదలోనైన అవిహితమును స్వీకరింపరాదు.

## 21. పాప్మానం ప్రజహిహి 3-41

మానవునకు మనోదోషమువలన ధర్మము న్యూనాధిక భావము కల్గుచున్నది. మనోగతమైనట్టి కాలుష్యము అందుకు హేతువు. అది కారణముగా ఇచ్ఛ లేకపోయినప్పటికి పాపమును ఆచరించుచున్నాడు. రజోగుణమువలన ఉత్పన్నమైన కామ క్రోధములు ఉత్తమభావమును ఆవరించుచున్నవి. అజ్ఞానముచే జ్ఞానము కప్పబడి పోవుచున్నది. వానివలన చిత్తసంస్కారము తగ్గిపోవుచున్నది. కాగా. ధర్మమందు సుగుణ దుర్గుణభావము అధ్యస్తమై విపరీతమగు ప్రత్యయమును కల్గచేయుచున్నది. ఆత్మనిరతి ఉన్నప్పుడే ధర్మశ్రద్ధ కల్గును. అట్టిశ్రద్ధ ఉదయించినపుడు కామ క్రోధాదులు దూరదూరములు కాగలవు. ఆసమయమున ఉత్తమ సంవేదనము కల్గవచ్చును. అందుచే జ్ఞానవిజ్ఞానములను నశింపచేయునట్టి పాపమును నశింపచేయుట ఉత్తమ కృత్యము. వానికొరకై మొదటగా అవశ్యము ఇంద్రియ నిగ్రహము సంపాదింపవలసి 'యున్నది. బ్రహ్మ

నిష్ఠతో ఇంద్రియ నిగ్రహము లేనివానికి పాప నాశ నము కల్గదు. కామరూపమైనట్టి మహాశత్రువును అన్నిటికి పర తరమైన ఆత్మనిష్ఠతో సర్వవృత్తులను నిగ్రహించి కామమును జయింపవలయును. జ్ఞానమును ఆవరించినట్టి అజ్ఞానపాపమును తొలగచేసికొనుటయే ప్రధానకర్తవ్యము. ఆవిషయమై ఎన్నడును ప్రమాదపాటు కలుగరాదు.

## 22. సంభవామి యుగే యుగే 4-8

మానవునకు పరమేశ్వరానుగ్రహమున్నప్పుడే పాపమును పోగొట్టు ఉపాయసంతతి గోచరమగును. స్వభావదుర్లలితత్వ మునుబట్టి ప్రాణికోటి క్రమక్రమముగా ధర్మదూరముకా వచ్చును. ధర్మాచరణములేక విపరీతగతిని అనుసరింపవచ్చును. ఆసమయమందు పరమేశ్వర ప్రబోధములేనిదే మానవుడు కర్తవ్యనిష్ఠుడు కాజాలడు. బ్రహ్మావేదనమునకు సమర్థమైన ధర్మప్రక్రియ లోకమందు బ్రహ్మర్షి సంప్రదాయమందును రాజర్షి సంప్రదాయమందును ప్రవర్తించినది. బ్రహ్మర్షి సంప్ర దాయమునకు విచ్ఛేదపాటులేదు. వివస్వంతునితో ఆరంభింప బడిన రాజర్షి సంప్రదాయము కాలచక్రము తిరుగుడులో నష్టప్రాయమైనది. అట్టియపుడు ప్రజలనేకవిధముల ధర్మదూరు లగుట కవకాశమున్నది. పరమేశ్వరునకు ఉత్పత్తి మొదలగు వికారములులేవు. అయినప్పటికి ఆత్మమాయను అనుసరించి అవతరించినట్లు భాసించును. కాలచక్రమునందు మార్పనేక విధములనుండును. ధర్మమార్గము ననుసరించువారొకప్పుడు

తగ్గిపోగా నధర్మానుయాయులతిశయింతురు. సాధుసంరక్షణ మున కవకాశములు నశించును. దుష్కర్ములడ్డులేక ప్రవర్తింతురు. ధర్మము ప్రతిష్ఠితమైనప్పుడుగాని యన్నియు చక్కబడవు. ధర్మసంస్థాపనకార్యము కేవలము పరమేశ్వరాధీనము. ధర్మస్థిరీకరణమునకు భగవాను డవతరించును. మానవులు పంచేంద్రియలోలురు. మానవుల వాతావరణమును చక్కచేయుటకు భగవాను డవతరింపవలయును. భగవానునకు సంబంధించిన విశేషములను భగవద్బుద్ధితో నాస్వాదించి మానవులు ధన్యులుకాగలరు. మానవుల కర్మపాకమే యన్నిటను సమర్థమైనప్పటికి భగవదవతారము కర్మబీజములను చక్కపరచి మానవులను సాధుమార్గమునందు ప్రవర్తింపచేయుటకు సమర్థమగును. అందుచే భగవానుడు యుగయుగమునందును తనయవతారమును ప్రదర్శించును. అవతారప్రయోజనమును నిర్ణయించుట శక్యముకాదు. పరమేశ్వరుని జన్మకర్మల రహస్యమును తెలియజాలము. ప్రాణి సముదాయమునందు కూడు కొనిన ధర్మశక్తి ఒక్కొక్కప్పు డుద్బుద్ధమగుచున్నది. అనేక విధముల సంపాదింపబడిన జీవుల యాత్మికశక్తియంతయు నొక చోట కేంద్రీకరింపబడి యవతారస్వరూపమును వహించును. అవతారము లనేకవిధముల నుండవచ్చును. కాని యీసూత్రమున నిర్దేశింపబడిన యవతారము ధర్మప్రయోజనకము. శ్రీకృష్ణ భగవానుడు సంపూర్ణమగు నవతారము. ఈతడు సాక్షాత్పరబ్రహ్మమూర్తి. ప్రతి మానవునియందును ధర్మకేంద్రమున్నది. దానిని స్ఫుటముగా తెలియువారు దైవీసంపదతో ప్రకాశిం

తురు. అస్ఫుట రూపముతో నున్నపుడు ఆసురప్రకృతితో నుందురు. ప్రాణి సామాన్యములో నున్న దైవసంపదకు యోగ్యఫలముగా ధర్మశక్తి స్ఫుటమగు అవతార స్వరూప మునుపొందును. శ్రీకృష్ణభగవానుడట్టివాడు. అట్లు సంభవము పొందినట్లవభాశించు పరమేశ్వరుడు జగమును ధర్మసూత్ర మందు ప్రవర్తింప చేయును. మానవులు తదనుయాయులగుట ధన్యులగుదురు.

## 23. చాతుర్వర్ణ్యం మయా సృష్టం 4-13

పరమేశ్వరుడు తన హస్తమునందు ధర్మచక్రమునుంచి త్రిప్పు చుండును. చక్ర క్రమమందుండవలసిన ధర్మనియతిని కూడ భగ వానుడు సూచించును. పరమేశ్వర నిర్ణీతములయిన విషయము లందు మానవునకు సంశయ ముండరాదు. మానవ స్వభావ చాపలమునుబట్టి ధర్మనియతియందు ధర్మము తెలియబడదు. అట్టి సమయమున సూత్రరహస్యమును దెలియవలసి యున్నది. వర్ణాశ్రమ ధర్మము వేదధర్మమునకు మూలకందము. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను వారు చతుర్వర్ణ ములవారు జన్మాంతర స్వభావ ప్రభవ విశేషము ననుసరించి వారా యావిధముల జన్మింతురు. మాతా పితరుల శుక్లరక్త ప్రభల సన్నివేశము కర్త యనబడును. ఆసన్నివేశములోని జీవప్రవేశము గుణమనబడుచున్నది. అట్టి ఆగుణ కర్మల పరి శీలనము కేవలము పరమేశ్వరాధీనమే. అందువలన బ్రాహ్మ ణాది జాతుల నిర్మాణములో ప్రబలమైన పరమేశ్వరేచ్ఛయే

హేతువు. జన్మాంతరములలోని గుణకర్మలనుబట్టి ఆయాజాతి సిద్ధమగుననని విస్పష్టమైన అర్థము. 'సృష్టం' అనునట్టి వచనము ఆయర్థమునే చెప్పుచున్నది. సత్కర్మాచరణ బొనర్చినవారు యోగ్యజన్మను పొందుదురు. దుష్కర్మాచరణమున హీనజన్మను పొందుదురు. అట్టిఆపొందిక భగవదధీనమైయున్నది. ఆజన్మయందలి గుణకర్మలుఆజన్మయందే బ్రాహ్మణ్యాదికమునుసంపాదించు ననుటసముచిత వాదము కాదు. అట్లైనచో ఒకేజన్మయందు ఒకే మానవుడు బ్రాహ్మణుడు క్షత్రియుడు వైశ్యుడు శూద్రుడు కావలసియుండును. అట్లే అగుననుట విరుద్ధవచనము. అనేక సంకీర్ణ జాతులున్నట్లు ధర్మగ్రంథములు చెప్పుచున్నవి. ఆసంకీర్ణ విధానముకూడ ఈ పక్షమునందు కుదురదు. అందుచే బ్రాహ్మణత్వాది జాతులు జన్మసిద్ధములని గ్రహింపవలయును. జాతి పరివృత్తికల్గినప్పుడు అన్యాన్యజన్మలు కల్గునని ఆపస్తంబుడు పలుకుచున్నాడు. కావున పరమేశ్వరుని ఇచ్ఛానుగృహీతమైన జాతివాదము ఇచట నిర్దిష్టమైనదని నిస్సందిగ్ధముగా గ్రహింపవలయును. అనేకరూపములు పొందెదనని పరమేశ్వరునకు ఇచ్ఛ జనించినది. ఆ ఇచ్ఛాప్రభవములైన రూపములు ఎనిమిదైనవి: నాల్గు పురుషరూపములు, నాల్గు స్త్రీరూపములు. అవియే బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర పదములతో చెప్పఁబడియున్నవి. పితరుల శుక్ల రక్త ప్రభలలో ఈ భిన్న ధర్మము కూడుకొనియున్నదని వైజ్ఞానికులు నిరూపించి చెప్పగలరు. స్వచ్ఛమైన ఈ పరిశుభ్రజాతులయొక్క కామబంధము లోని విశేషమునుబట్టి సంకీర్ణ జాతులుత్పన్నమైనవి. ఇట్లు

తత్త్వార్థమును విస్పష్టముగా తెలిసినప్పుడే భగవానుని ఆదేశము అవగతమగును. అందరకును ఆయాజాతి విభాగమును బట్టి ధర్మములు నియతములైయున్నవి. అట్టి నియత ధర్మములను ఎన్నడును ఉల్లంఘింపరాదు. భగవదిచ్ఛా నిరూపితములైన విస్పష్టములైన ఆయా జాతులందు కూడుకొనిన మానవులు స్వభావమున ప్రవర్తించి ధన్యులగుట ఉత్తమము. భగవదిచ్ఛలో ధర్మము కూడుకొనియున్నది. ధర్మమందు కర్మ ఇమిడియున్నది, కర్మానుసారమున జాతివిభక్తమైనది. దీనికంతకును పరమేశ్వరుడు నియామకుడు.

## 24. గహనా కర్మణో గతిః 4-17

ప్రాపంచికదృష్టిలో పరమేశ్వరుడు అన్నిటికినికర్తగా భాసించును. వాస్తవముగా పరమేశ్వరునకు కర్మసంబంధము లేదు. అయినప్పటికి ఆతనికి కర్మఫలస్పృహ లేకపోయినప్పటికి ఆయా విధమున పామరులకు గోచరించును. పరమేశ్వరుని జన్మకర్మల స్వభావమును రహస్యమును పరిశీలించినప్పుడే మానవునకు సార్థకతకల్గును. పారమేశ్వరవిజ్ఞానము కల్గుటకు అవశ్యముగా కర్మ ఆచరింపవలసియున్నది. పరమేశ్వర రహస్యమును తెలిసి ఆచరించునప్పుడు ఎట్టిహానియుకల్గదు. ముముక్షువులగువారును అట్లే ఆచరింతురు. కర్మ అకర్మ విషయమై విజ్ఞానులు మోహితులగుచున్నారు. కర్మ పరిజ్ఞానము అశుభవిముక్తిని సంపాదించును. కర్మ వికర్మ అకర్మ వీని స్వభావము కూడ తెలియతగియున్నది. కర్మగతి గహనము. పరమేశ్వరుని

యందు నిగూఢప్రజ్ఞకల్గినప్పుడుగాని కర్మవిషయము గోచరము కాదు. కర్మా కర్మలందు పరస్పర సమన్వయము తెలుసుకొని ప్రవర్తించినప్పుడు బుద్ధిమత్త ఉదయించును. ప్రపంచ విలాసమందంతటను పరమేశ్వర భావమును పరమేశ్వరునియందు ప్రపంచ విలాసమును పరస్పర సమన్వయ విధానముతో పరిశీలించినప్పుడే గహనమైనప్పటికి కర్మగతిబుద్ధమగును. సంగ రహితుడై బ్రహ్మభావముతో బ్రహ్మకర్మసమాధి ననుసరించి బ్రహ్మలక్ష్యముకల్గి ప్రవర్తింపవలయును. ఆత్మను లక్ష్యముగాచేసుకొనక ప్రవర్తించినప్పుడు కర్మమార్గమంతయు సంకీర్ణమై విక్షేపముకలదియై కన్పడును. విశుద్ధలక్ష్యమును అనుసరించినచో గహనత్వము భాసింపదు. కేవలము కర్మయే లక్ష్యమైనప్పుడు అది గహనమైపోవును. కావున కర్మయంతయు ఆత్మరహస్యమును సంబంధింపచేసికొని ఉన్నదని గ్రహింపవచ్చును.

25. యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనం 4–31

మానవు డవశ్యముగా కర్మనాచరింపవలసియున్నది. కర్మవలన తాను ప్రజ్ఞావిలాసుడు కావలసియున్నది. అట్టికర్మలయొక్క నియతసమాచరణమే యజ్ఞముగా చెప్పబడుచున్నది. వేదముఖమందు కర్మ లనేకవిధములుగా విస్తృతమైయున్నవి. మానవుల తరతమభావము ననుసరించి యజ్ఞవిధానములు అనేకములు. తాను సాధకుడై నియతసాధనముల ననుసరించి సాధ్యనిశ్చయముతో ప్రవర్తించుట సామాన్యముగా యజ్ఞమనబడును. ఇహలోకమునకు సంబంధించినయజ్ఞములు

కొన్నికలవు. పరలోకమును ఉద్దేశించినవి కొన్నికలవు. ఇహపర సమన్వయమును సంపాదించు యజ్ఞములును కలవు. వీని కన్నిటికిని దేహసమన్వయమును సంపాదించునట్టి సువిధానముకూడ యజ్ఞముగా చెప్పతగియున్నది. వీని అన్నిటికన్న ఉత్తమముగా ఆత్మలక్ష్యమైన యజ్ఞమున్నది. స్వస్వరూపముయొక్క విశేషమును అనుసంధానముచేయుచు మానవుని చైతన్యధార ప్రసరించినప్పుడు ఒక విశిష్టమగు యజ్ఞముగా చెప్పబడుచున్నది. దీనిని జ్ఞానయజ్ఞ మందురు. అన్నిటియందును ఈ జ్ఞానయజ్ఞమే ప్రధానమని చెప్పబడుచున్నది. ప్రతి యజ్ఞమందును శ్రద్ధ ముఖ్యము. యజ్ఞశిష్టముయొక్క స్వీకారము ముఖ్యముగా ఎన్నబడుచున్నది. ఆయాకర్మలందు పరిపూరితమైనట్టి యజ్ఞములోని హవిస్సు మానవుని ఆత్మకు పవిత్రతను సంపాదించును. యజ్ఞశేషము సుధా ద్రవ్యముగా చెప్పబడుచున్నది. ఆసుధా స్వీకారము మానవునకు శ్రేయఃప్రదము. సామాన్యముగా యజ్ఞభావన కల్మష నాశకము. భౌతికములైనట్టి నానావిధములగు ద్రవ్యములతో నిర్వర్తింపబడు యజ్ఞములలో మానవుని భౌతిక దేహము పవిత్రతను పొందును. యోగయజ్ఞమందు సముచితమైన దీక్షాపద్ధతిలో దేహమందున్న నాడీచక్ర మంతయు పరిశుద్ధినిపొంది మనః ప్రసాదమును కల్గచేయును. అట్లే తన అభ్యంతరమందు సంచరించునట్టి వాయువునకు సంబంధించిన యజ్ఞ విశేషము ఆత్మపావనము చేయుచున్నది. ఆత్మజ్ఞానము నుద్దేశించిన జ్ఞానయజ్ఞము తనకును పరమేశ్వరునకును కల భేద

భావమును నశింపచేసి ఉత్తమప్రజ్ఞను సంపాదించునది యగు చున్నది. ఆయాయజ్ఞములయొక్క శేషాంశములందు సర్వశేష మైన ఆత్మద్రవ్యము అనుభవమునందు ఆస్వాదించునది కావ చ్చును. ఆయా శేషాంశములం దంతటను ఆత్మభావమే ప్రామాణికానుశిష్ట మగుచున్నది. ఆ ఆత్మభావనయే యజ్ఞ శిష్టామృత భోజనము. ఈ అమృతభుక్తి సనాతనబ్రహ్మను పొందింపచేయును. యజ్ఞములైనను కర్మజన్యములై యున్నవి. ఆత్మారాధనకై మానవుడు కర్మయందు అవశ్య ముగా ప్రవర్తింపవలసి ఉండుట శాస్త్రచోదితము.

## 26. తద్విద్ధి 4-39

కర్మమార్గము చిత్రము. అంతరంగభావములు అనంతములు. వానిలోని నియతమగు ప్రణాలిక కర్మ సూక్ష్మభావమును నిరూపించును. అంతరంగవృత్తులలో చిత్రవిచిత్రములైన భిన్న భిన్నములగు అనంతభావములు ఉద్భూతములగును. వానినన్ని టిని ఒక మానవుడు అవగాహన చేసికొనజాలడు. నియత సూత్రము ననుసరించు నట్టి వివిధభావములను తెలుసుకొనుట కూడ మానవజీవితమునకు క్షేమముకాదు. అందువలన జీవిత గతిలో కర్తవ్యనిర్ణయము చేయునట్టి సంప్రదాయశిక్ష అవస రము. తగిన సాంప్రదాయిక విజ్ఞానములో క్రమబద్ధములైన యోగ్యసాధనలుండును. అవి నియతలక్ష్యమును అనుసరించు నవియై శ్రేయస్కరములగును. సాధకుడు వానినే తెలుసు కొనవలయును. అట్టివాటిని తెలియచేయుటకు తత్త్వదృష్టికల

విజ్ఞానులు సమర్థులు. వారి సన్నిధానమున ఉపదేశరూప మునగా జ్ఞానమును పొందవలయును. అందుకొరకై ఉత్తమ గురుసన్నిధానమందు ప్రణిపాతము పరిప్రశ్న సేవాదీక్ష ఆవశ్య కములు. వీనినన్నిటిని అనుసరించి ఆత్మవేదనమును సాంప్రదా యికముగా తెలియవలయును. దానివలన శోకమోహములు నశింపగలవు. ఆత్మ సాక్షాత్కారముకల్గును. అవిజ్ఞానము వలన భూతసమూహమంతయు తనయందు సమన్వయము పొందును.

## 27. న హి జ్ఞానేన సదృశం 4-38

ఆత్మవిషయమగు జ్ఞానమే జ్ఞానము. అట్టిజ్ఞానముతో సమాన మగునది ఏదియులేదు. పాప మహాసాగరమందు జ్ఞానము యోగ్యమగు నావ. పాపమునంతను జ్ఞానాగ్ని భస్మము చేయును. అత్యంతము పవిత్రమైన జ్ఞానమువలననే యోగసం సిద్ధి కల్గును. అనాదిగా నుండునట్టి అజ్ఞానము జ్ఞానముచే తొలగిపోవును. ఒక్కొక్క వస్తువును సంబంధించి ఉత్పన్న మగునట్టి జ్ఞానము సాపేక్షమైయుండును. ప్రపంచ వ్యవహార ములలో సాపేక్షజ్ఞాన మపేక్షితమైయున్నది. నిష్ప్రపంచమైన పరమాత్మయందు స్వస్వరూపజ్ఞానమే అపేక్షితము. ఎట్టిజ్ఞాన మందుమ జ్ఞానాకారమునకు హానిలేదు. జ్ఞానముయొక్క తేజస్సు వానియందన్నిటను అనుగతమై ప్రకాశించుచునే యున్నది. ఉచితమైన శ్రద్ధయున్నపుడే జ్ఞానముదయించును. ఆత్మనిష్ఠ ఇంద్రియనిగ్రహము పరమావశ్యకము. నిరతిశయ

మగు శాంతి జ్ఞానమువలననే కల్గుచున్నది. కావున ప్రాణిసా మాన్య మంతయు ఆత్మవిజ్ఞానమునకై ప్రయత్నింపవలయును. ఆత్మవిజ్ఞాన మొకటియే సర్వవిజ్ఞానమును సంపాదించును. సర్వ సాక్షాత్కారమును ఆత్మవిజ్ఞానముననే కల్గును. అన్నియు జ్ఞానకోశమునందే ఇమిడియున్నవి కావున జ్ఞానసమానమేదియు లేదు.

## 28. సంశయాత్మా వినశ్యతి 4-39

ఆత్మవిషయికమగు జ్ఞానము సాంప్రదాయికముగా తెలియతగిన దని నిశ్చితాభిప్రాయము. గురుసన్నిధానమున జ్ఞానోపదేశము పొందినపుడు లేశమాత్రమైనను అవిశ్వాసముదయింపరాదు. ఉపదేశప్రణాలికలో కూడుకొనినవిధానమహాత్వము సామాన్య ప్రజ్ఞతోకూడుకొనిన సాధనకు అనుభవగమ్యము కాక పోవచ్చు. అల్పమైన తన అనుభవమందు లేదుకదా అని విపరీత బుద్ధికలవాడుకారాదు. ఉపదేశింపబడినఅర్థము సరిగా తెలిసి కొనకపోవుట హానికరము. గురూక్తమందు విశ్వాసము లేక పోవుట శ్రేయస్కరముకాదు. తన అల్పప్రజ్ఞను స్వల్పాను భవమును ఉన్నతభావముతో సంబంధింపచేసికొనుచు సమ న్వయము కుదురక సందిహానుడగుట సముచితముకాదు. ప్రాక్తన పాపపంకిలములైయున్న తన క్షుద్రభావములను జ్ఞానసాగరములో విలీనముచేసికొనవలయునేకాని ఆ జ్ఞానాగ్ని సన్నిధానమునకూడ ప్రత్యేక స్వరూపముకలవానినిగా చేయ రాదు. అట్లొనర్చుట హానికరము. సందేహబుద్ధి వినాశకము.

సందిహాను డైనప్పుడు ఇహపరలోకములు లేవు. ఎట్టిసుఖ మును కల్గదు. కావున నిస్సందిగ్ధబుద్ధియై సంప్రదాయవచన మందు విశ్వాసముకల్గి ప్రవర్తింపవలయునని పరమతాత్ప ర్యము.

## 29. యోగమాతిష్ఠ 4-42

ఆత్మోపలబ్ధికి నియతసాధన మావశ్యకము. ఆత్మలక్ష్య మున్నప్పుడుగాని నిశ్చితానుసంధానము కుదురదు. అట్టి పరమ లక్ష్యోపాసనయందే సంశయములన్నియు జ్ఞానసంఛిన్నము లగును. ఆత్మతేజముకల్గును. ఆత్మముఖముగా ఎన్నికర్మ లను ఆచరించినను అవి బంధహేతువులుకావు. సంశయము అజ్ఞానమువలన హృదయమందు జనించును. ఆసంశయ లతను జ్ఞానఖడ్గముచే ఛేధింపవలయును. అజ్ఞానమంతయు నశించగా ఆత్మయోగశక్తి వికాసించును. ఆవికస నము ఆ పరమేశ్వరశక్తి ప్రసారము మానవుడు వ్యర్థముచేసి కొనరాదు. యోగనిష్ఠితుడై కర్తవ్యమును పాలింపవలయును. సంశయము ఛిన్నమైనప్పుడు క్షుద్రమైన తన భౌతికవాదములు స్వరూప ప్రతిష్ఠనుపొందవు. కేవలము పరమేశ్వర సంబంధ మైనభావమే అనుభవమందు భాసించును. అట్లు దానిని అవ భాసింపచేసికొనుటయే పరమకర్తవ్యము అని విధింపబడు చున్నది. ఉత్తమమైన అట్టి ఆత్మదీక్ష ఉదయించునపుడు కర్త వ్యపరాయణత్వము అవశ్యముదయించును.

## 30. అజ్ఞానేనావృతం జ్ఞానం 5-15

పరమేశ్వరారాధనకు కర్తవ్యపాలనము ఉచితము. అందు కొరకై యోగానుష్ఠానముచితము. కాని అందరును అట్లు ప్రవర్తించుటలేదు. ఉచితమను విజ్ఞానమున్నప్పటికి అందరును ప్రవర్తింపరు. ప్రవర్తించుటకును సరియగు అవకాశముకల్గుట లేదు. ఇందనేక హేతువులుండవచ్చును. వానియందన్నిటను అజ్ఞానమొకటియే ప్రధాన హేతువు. ఆత్మవిషయమగు జ్ఞానము అజ్ఞానముచే ఆవృతమగుచున్నది. అందువలన జ్ఞాన స్వభావము తదుచితమైన విధానము అనుకూలమైన సరణి మానవప్రవృత్తిలో ఉండుటలేదు. సర్వప్రాణిసమూహా మును ఈఅజ్ఞానముచే వ్యామోహము పొందుచున్నది. సహజ మగు స్వరూపమును తెలిసికొనక పోవుటలో. తెలిసికొనలేక పోవుటలో ప్రధాన కారణము అని చెప్పతగినట్టి అవిద్య అనాదిగా ప్రవృత్త మగుచున్నది. ఎంతగా సమావృతమై నప్పటికి అది ఆగంతుకమేకాని వాస్తవముకాదు. ఆగంతుక భావము ఎన్నడును చిరస్థాయి కాజాలదు. ఒకప్పుడు ఇంతటి ప్రబలమైన అజ్ఞానమునకు కూడ హానియున్నది. అజ్ఞాన నాశ మునకు జ్ఞానమొకటియే ఉత్తమసాధనము. ఆజ్ఞానము సూర్యునివలె ప్రకాశించునదియై సర్వమును నశింపచేయును. ఆత్మపరాయణత్వమున ఇది సంప్రాప్తమగుచున్నది. అదియే సర్వలక్ష్యము.

1 పండితాః సమదర్శినః 5-18

అజ్ఞానము నశింపగా జ్ఞాన ముదయించును. జ్ఞానోదయమున్న నే పండితుడు అనబడును. పండా వేదజ్ఞానము. ఆత్మజ్ఞానమే పండాశబ్దముచే చెప్పబడుచున్నది. ఆత్మజ్ఞానము కలవారు పండితు లనబడుదురు. అట్టివారు సమదృష్టికల్గి ఉందురు. దోష గుణరహితమైనట్టి పరబ్రహ్మ సమపదముచే చెప్పతగియున్నది. పండితులగువారు పాషాణము మొదలు పరమేశ్వరుని వరకు కల పదార్థ సముదాయము నంతను బ్రహ్మరూపముగా దర్శింతురు. వారిదృష్టియందు బ్రహ్మాతిరిక్తమగు భావనయే ఉండదు. సచ్చిదానందాత్మకమైన ఆత్మను అంతటను వారు దర్శింతురు. నిశ్చితమైన బుద్ధివృత్తి నంతను పరమాత్మయందే సమన్వయ మొనరింతురు. తమ ఆత్మప్రజ్ఞకంతకును పరమేశ్వర సాక్షాత్కారమే ఫలమని భావింతురు. కేవలము ఆత్మనిష్ఠత్వమునే ధన్యతగా తలంతురు. కేవలము ఆత్మసంగులై ఆత్మపరాయణత్వమున స్వరూపసాక్షాత్కారమును పొందుదురు. పునరావృత్తిరహితమైన శాశ్వతానంద ధామమును చేరుదురు. వారి కల్మషమంతయు నశించును. న్యూనతకాని ఆధిక్యముకాని వారి దృష్టిలోలేదు. విద్యావినయసంపదకల ఉత్తమ బ్రాహ్మణునియందు పరమసాత్వికమైన గోవునందు మహోన్నతమైన గజమునందు క్షుద్రమైన శునకమునందు అధముడైన శ్వపాకునియందు పండితులు సమదృష్టికల్గియుందురు. మానవమాత్రునకు సామ్యబుద్ధి విధింపబడుచున్నది. సామ్యమందు మనోలగ్నతను సంపాదించిన

మహనీయులు స్వర్గాదుల కాంక్షింపరు. బ్రహ్మవేత్తయై అట్టి వాడు బ్రహ్మనిష్ఠుడై బ్రహ్మయోగ ప్రజ్ఞకలవాడై అక్షయ సుఖమును పొందును. జ్ఞానపర్యవసానము తెలిసికొనినట్టి పండితవరేణ్యునకు ప్రాపంచిక విలాసమేమాత్రము అపేక్షితముకాదు. ప్రకృతశరీరము నశింపకపూర్వమే కామక్రోధాదులను అణచిపెట్టుకొని విషయాసక్తిలేక ప్రవర్తించు పండితులు బ్రహ్మభావము పొందుదురు.

## 32. జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి 5-29

ఉత్తమవిజ్ఞాన ముదయించినప్పుడు పరమేశ్వర వేదనమేఫలము. పరమేశ్వర విజ్ఞానమున పరమశాంతిని పొందవచ్చును. పరమేశ్వరుని తెలిసికొనుట పరమశాంతిని పొందుట ఈ రెండును ఒకటియే. వీనిని అజ్ఞాన వ్యామోహ వినాశమనియు చెప్పతగును. సర్వయజ్ఞ విధానములకు తపోరహస్యములకు భూత విశేషములకు మహేశ్వరుడైన పరమాత్మ శ్రీకృష్ణుడు. ఆతని తెలిసికొనుటకు ఆత్మయోగము నవలంబింపవలయును. సమాధిప్రజ్ఞను అవగాహము చేసికొనవలయును. వీనికన్నిటికి ప్రథమముగా ద్వైతభావమును విధ్వంసమొనర్చుకొనవలయును. సర్వభూతహితరతమతియై యతచేతస్కుడు కావలయును. అప్పుడే శ్రీకృష్ణవేదనము కలుగకలదు. ఇది నిరతిశయ నిర్వాణము.

## 33. ఉద్ధరేదాత్మనాత్మానం 6-5

ఆత్మయోగము పొందవలయుట అవశ్య కర్తవ్యము. శాస్త్రములుకాని గురువచనముకాని మార్గసూచకములే. తనను తానే ఆదరించుకొనవలయును. వేరొక సముద్ధర్త అచటలేడు. సముద్ధరణము అపేక్షితమైనప్పుడు ప్రాప్యప్రాప్తిలేక మానవుడు పతితుడై యుండును. పతనము అనేకవిధముల కల్గవచ్చును. నానావిధము కావచ్చును. అన్నిటిలో ఆధ్యాత్మికమైన ఆత్మపతనము శ్రేయోవిఘాతము. ఇదివరలో తనకు సంప్రాప్తమైన ఆత్మిక పతనమునకు తానే హేతువు. తానిదివరలో ఒనరించినట్టి ధర్మాధర్మ విశేషములనుబట్టి ఉచ్చావచ స్థితి కల్గుచుండును. తనపాపము తన ఆధ్యాత్మిక పతనమునకు కారణము. మొత్తమునకు తానే తనకు సర్వవిషయములందును హేతువగుచున్నాడు. అట్లే తన యుద్ధరణమునకుకూడ తాను హేతువు కావలయును. ఆత్మసముద్ధరణము కష్టతరమగు కార్యమే. అయినను అందుకొరకై ప్రయత్నింపక తప్పదు. ప్రయత్నింపకపోయినచో ఆత్మనాశముకల్గును. ఆత్మనాశకృత్యమును చేయరాదు. కష్టతరమగు కార్యసమారంభమందే ఉత్తమ ఫలమున్నది. కష్టప్రతిఘాతములను ఓర్చుకొనవలయును. అన్నిటికి మూలముగా మనస్సును ఆత్మలగ్నము చేయవలయును. అప్పుడట్టిమనస్సు ఆత్మబంధువై ఆత్మసముద్ధరణకై ఉపయోగించునది కాగలదు. మనస్సునకు ఆత్మదృష్టి లేకపోయినచో అట్టిమనస్సు ఆత్మికముగా శత్రువగుచున్నది. తనకు తాను ఎన్నడును శత్రువుకారాదు. శత్రుభావమును నశింపచేసి

కొని ఆత్మయందు బంధుభావమును ఆపాదించుకొనవలయును. తన పతనమునకు హేతువైన తాను తన ఉద్ధరణమునకుకూడ హేతువు కాగలడు. అందుకొరకై యోగారూఢత్వమును సంపాదింప వలసియున్నది. అట్లే అనేకవిధములగు సాధనలు అపేక్షితములు. సర్వసంకల్పసన్యాసమందు ముఖ్యవిధానము. ప్రాపంచ విషయమందు మనస్సు ప్రసరించునంతవరకు ఆత్మికాభ్యుదయము కల్గదు. ఆత్మవృత్తి నీచైర్గామి అగును. సంకల్పప్రేరితములైన చిత్తవృత్తులు అనేకథా ప్రవర్తించి విప్రకీర్ణములగును. కావున వానిని నిరోధించుటయే అవశ్యకము. ఐహికమైన ప్రసారమును నిరోధించినప్పుడు ఆత్మికమైన మనోరసధారధారావాహికమై ప్రసరించును. అప్పుడు ఆత్మోద్ధరణము కల్గును. ఆత్మసముద్ధరణమునకు మహనీయులు సూచించినట్టి అనేక మార్గములు కలవు. వాని నవగాహము చేసికొని తనకు తగిన విధానములను సమన్వయించుకొని అభ్యసింపవలయును. నియత విధానముయొక్క అనుసరణము లేకపోయినచో తనకు కల్గిన ఆధ్యాత్మిక పతనమునుండి సముత్తరణము కల్గదు. అభ్యుచ్ఛ్రయమునకు ఉన్ముఖుడై శ్రమపడియైన ఆత్మసముద్ధరణ మొనర్చుకొన వలసి ఉండుట విధింపబడుచున్నది.

### 34. సమబుద్ధిర్విశిష్యతే 6-9

సమానమగు బుద్ధివృత్తికలవాడు విశిష్టుడని యర్థము. బుద్ధివృత్తులందు సామ్యభావమున్నచో విశేషముదయించునని భావము. ఆత్మోద్ధరణమునకు ప్రయత్నించు మానవుడు సర్వ

భూత సమభావుడై యుండును. అన్నిటియందును ఆత్మచైత న్యము విశేషముగ నున్నదని భావించును. న్యూనాధిక భావము లాతని దృష్టియందవభాసింపవు. అంతరంగములందలి తరతమ భావముగాని శరీరమందలి యల్పత్వ మహత్వములుకాని జన్మ గతము లయిన జాతి విశేషములుగాని యాతని బుద్ధివృత్తి యందనుగతములు కావు. ఆత్మనిగ్రహము కలిగి ప్రశాంత మనస్కుడైయున్న యాతనియాత్మభావనలో ద్వంద్వభావము లేవియు కలతపెట్టునవికావు. స్వస్వరూప పరినిష్ఠకలిగి నిత్యా మోద పరితృప్తుడగును. ప్రపంచ విలాస నిరతుడైయుండు నాతడు నిత్యమాత్మానుసంధానమునను నిష్ఠకలవాడగును. కావున స్వీకార్యాస్వీకార్యములుకాని ద్వేష్యప్రేమ్యములు గాని యుండవు. ప్రాపంచిక భావపరీతుడయిననే భేదభావము కలవాడగును. ఆత్మ ప్రతిభాసముతో కూడుకొనిన సమబుద్ధి సర్వవిశిష్టుడు. సామాన్యముగా లోకమానవు లనుకూలములను సేవించుటయందే ప్రజ్ఞకలవా రగుదురు. ప్రతికూలముగా నుండువాని ననుభవింపజాలరు. ప్రతికూలము లందును అను కూలభావమును పరిశీలింపజాలరు. సమబుద్ధియగువానికి అనుకూల ప్రతికూలములనునవియే యుండవు. అనుకూలము లును ప్రతికూలములె. ప్రతికూలములును అనుకూలములె. భౌతికముల నన్నిటిని యాత్మయందు పరిశీలించి యాత్మ రూపితములుగా జేయగలిగిన సమయోగ ప్రతికూలములను గాంచడు. భౌతికములందన్నిటను పరమేశ్వరభావము చేయ విశిష్టభావుకుడు ఎచటను ప్రతికూలత్వమునే చూడడు. ఆతని

కన్నియు పారమేశ్వరములె. ఇట్టివాడయినపుడె విశేషము కల వాడనదగును. ఏతదతిరిక్తు లందరును అత్యల్పులని భావింప దగును.

35. యుంజ్యాద్యోగమాత్మవిశుద్ధయే 6-35

సర్వభూత సమభావమును సంపాదించుట కాత్మవిశుద్ధి యవసరము. చిత్తసంస్కార మున్నపుడే పరమేశ్వరుని భావించు సామర్థ్యము కలుగును. మనోనిర్మలతయే యాత్మవిశుద్ధి. నిష్కల్మషభావ మన్నిటియందును అత్యంత మవసరము. ఆత్మసంశుద్ధి సంపాదనకై యోగయుక్తి యపేక్షితము. చిత్తవృత్తుల నిరోధించుట యోగమని చెప్పబడుచున్నది. శక్తులను ప్రక్షీణము చేసికొనరాదు. వానిని నిరోధించినపు డాత్మిక వికాసము కలుగును. యోగము నవశ్య మవలంబింపవలయును. ఏకాంతసేవనమునందె యోగము ఫలప్రదము కాగలదు. అభ్యాసమునకు వలసిన సాధన సామగ్రిని సంపాదించి ఏకాగ్రమనస్సుతో నిరతము నియతనిష్ఠ గలిగి యాత్మభావన చేయవలయును. ప్రాపంచికములయిన భావములను యోగి మున్ముందవశ్యము నిరోధింపవలసియున్నది. ఒకచో నిరోధము కలిగినపుడు వేరొకచో ప్రసారముండును. ఆత్మవిషయమగు ప్రసారమె యుండవలయును. యోగ మందులకు సమర్థము. యోగ నిష్ఠయందు సమాధిప్రజ్ఞకలుగును. సమాధియందు సుఖానుభూతి యున్నది. తదాస్వాదము కలిగినపుడెంతటిదుఃఖమయినను చలింపచేయచాలదు. చిత్తవృత్తులను నిరోధించినప్పుడు ఆవరణముగానున్న అవిద్య క్రమక్రమముగా నశించును.

ప్రాపంచికముగా చిత్తప్రసారము లేకపోగా చిత్తవిలాసమైనట్టి ప్రపంచమంతయు లీనమగును. కేవలాత్మభావనలో ఆప్తకామత్వ ముండును. యోగసంసేవనమువలన చిత్తము ఆత్మభావముపొంది నిరుద్ధ మగును. అచట ఆత్మదర్శనము కల్గును. చిత్తసంకల్పములందు అనేకవిధములగు కాంక్షలుదయించును. యోగసాధనములో అనేక సిద్ధులు కలుగవచ్చును. వానియందు అభిలాషము పెట్టుకొనక అంతరాంతరా కల్గునట్టి సిద్ధివ్యామగ్ధుడుకాక కేవల మాత్మసంశుద్ధికై ప్రయత్నింపవలయును. అత్యంతము ఆహారమును స్వీకరించుట ఏమియు స్వీకరింపక పోవుట యోగమునకు సాధనకాదు. అత్యంతము నిద్రించుట కాని కేవలము జాగరముతోనుండుటకాని ఉచితముకాదు. చిత్తనిరోధములో చైత్తికభావములు నశించిపోగా మాయావిలాసమంతయు విలీనమైపోవును. ఆత్మవిశుద్ధియే ఫలముగా యోగమును అవశ్యము స్వీకరింపవలయునని సూత్రార్థము. తగిన చిత్తసంస్కారము కల్గినప్పుడు సమదృష్టి దానియంతట నదియే కల్గును. కావున పూర్వసంస్కారముగా యోగావలంబనము సముచితము.

### 36. శనైః శనైరుపరమేత్ 6–25

మనస్సు ప్రాణము దృష్టి ఈమూడును బహిఃప్రపంచమందు ప్రసరించి మానవునకు విషయాసక్తిని సంపాదించుచున్నవి. మనస్సున్నిటను ప్రధానము. ఇంద్రియసమూహామంతయు మనస్సుతో నియమింపవలయును. ప్రపంచస్వభావముగా ఇంద్రియవృత్తులు ప్రపంచవిషయములందు ప్రసరిం

చును. సంకల్పము దృఢము కాకపూర్వము వానిని హటా త్తుగా బలాత్కరించి నిరోధింపరాదు. అట్లు బలవన్నిరోధము ప్రయోజనము కల్గచేయలేదు. ఆయావిషయములనుండి మెల్ల మెల్లగా మరలింపచేయవలయును. ఆయావస్తువులందు నశ్వ రత్వమును క్షుద్రత్వమును అవాస్తవత్వమును ధృడముగా భావించి ఉపరతిని సంపాదింపవలయును. అట్లుచేసిననే క్షేమముకల్గును. అందువలననే బుద్ధివృత్తియందు ధృతి అవ శ్యముగా నుండవలయును. మున్ముందుగా మనస్సును నిరో ధించి ఆత్మసంస్థ మొనరించినచో మనఃప్రేరణ ముండదు. కాన ఇంద్రియములు ప్రసరింపవు. మనస్సు యేయేమార్గ మున ప్రసరించునో ఆమార్గములందంతటను నిరోధమును సంపాదింపవలయును. ఆత్మవశత్వమును సిద్ధము చేయవల యును. అభ్యాసక్రమమున అట్లొనరించుటయే శ్రేయస్కరము.

## 37. స యోగీ పరమో మతః 6–32

క్రమవిధానములో పాటవముకల్గును. ఆ సామర్థ్యమువలన ప్రశాంతమనస్కుడగును. రజస్తమోగుణములు నిరస్తము లగును. ఆసాధకుడు సుఖముగా బ్రహ్మసంస్పర్శమును పొంద గలడు. సమదర్శనుడు కాగలడు. సర్వభూతములందును పర మేశ్వరునిచూచును. ఆత్మయందు సర్వభూతములనుచూచును. యోగయుక్తాత్ముడైన ఆతడు సమదర్శనుడగును. సర్వభూతము లందును అనుగతమైయున్నట్టి శ్రీకృష్ణభావమును ఆ పరమ యోగి తెలుసుకొనగలడు. ఈవిధముగ ఇష్టభావనచేయునట్టి

ఆయోగి భగవానున కత్యంతము అభిమానపాత్రుడగును. భగవానుని ప్రేమించువారు భగవానునిప్రేమకు భాజనులగుదురు. సర్వభూతములను సమభావముతో చూడగల్గినవారే భగవానుని భజింపగలరు. సర్వభూతహితాసక్తుడగువాడే పరమేశ్వరప్రీతిపాత్రుడు. పదార్థసామాన్యమందంతటను భగవానుడనుషక్తుడైయున్నాడు. నిర్వైరభావముతో అన్నిటను పరమేశ్వరునిచూచువారికి భగవానుని నిత్యప్రసన్నత భాసించును. అంతటను ఆత్మయోగమును భావించినవాడే యోగిపదముచే చెప్పతగియున్నాడు. అట్టి పరమయోగిని పరమేశ్వరు డనుగ్రహించును. యోగియగువానికి ఆత్మ అత్యంతము ప్రియము. ఆత్మైక్యముతో సర్వమును భావించుటయే పరమయోగసాధనము.

### 38. మనోదుర్నిగ్రహం చలం 6-35

యోగయుక్తికి మహానిగ్రహ మపేక్షితము. ఆత్మ విషయమై మనఃప్రసారము అవిద్యా ప్రభావమువలన నిరుద్ధమైనది. అందువలన మనస్సు ప్రపంచగతిని అనుసరించుచున్నది. ప్రాపంచిక విషయములు అనంతములు. అనంత విషయము లందును మనస్సు సంసక్తమగును. ఒకదానివలనను సమగ్రముగా తృప్తిని పొందలేదు. అట్టి అతృప్తభావము తోడనే మనస్సనేకము లందు మాటిమాటికి క్షణక్షణము ప్రసరించును. అందువలన అది అత్యంతము చంచలము. స్థిరమగుస్థితి మనస్సునకు కల్గుట దుర్ఘటము. ప్రపంచసక్తమైన మనస్సు బలీయమై యుండును.

అది ఎంతగా ప్రపంచగతిని పొందునో అంతగా ఆత్మఘాత మొనరించుచున్నది. వాయువు నిగృహీతము కాజాలదు. మనస్సును నిగ్రహింపబడనేరదు. అతిచంచలము నిగ్రహింప శక్యము కానిదియు అగు మనస్సును ఎట్లైనను నిగ్రహింప వలసియున్నది. మనస్సెట్టిదైనను అభ్యాసముచే నిగ్రహింప వచ్చు. మహావిషయములందు వైరాగ్యమును సంపాదించి నచో చాంచల్యము లేకుండ చేయవచ్చును. మనస్సునకు ఆత్మదృష్టిని సంపాదించినచో అన్నియు సిద్ధములు కాగలవు. ఆత్మసంయమనము లేకపోయినప్పుడు యోగప్రాప్తిలేదు. ఆత్మ వశీకారమున ఉపాయస్వీకారమున మనస్సును బాగుచేయ వచ్చును. సంకల్ప వికల్పములు మనస్స్వరూపములు. స్థూల ముగా గాని సూక్ష్మముగా కాని అవభాసించు మనోవిషయ ములను నిర్మూలించినచో మనస్సునకు మనస్త్వము నశిం చును. అప్పుడది ఆత్మవశము కాగలదు. ఇట్లొనర్చుట అత్యంత మావశ్యకము.

## 39. న హి కల్యాణకృ ద్దుర్గతిం గచ్ఛతి. 6-40

పరమేశ్వరునకు సంబంధించిన కల్యాణకర్మను ఆచరించినవానికి ఎప్పుడును దుర్గతికల్గదు. ప్రాపంచిక పరిభవమును పరిత్యజించి యోగాసక్తుడైన మానవుడు ఒకప్పుడు కాలవిపాకమువలన అనుకూలఫలమును పొందకపోవచ్చును. యోగసంసిద్ధిలేక ప్రపంచవిషయానుభవములేక రెండిటను పరిభ్రష్టుడైనను ఆత్మ యోగమందు ప్రవర్తించిన మానవుడు దుర్గతిని పొందడు.

ఇహపరములందును ఆతనికి వినాశము లేదు. తానొనరించిన యోగమునకు ఫలమున్నది. పుణ్యభూములలో ఆఫలము ననుభవించును. పుణ్యము సావశేషముకాగా రాజాధి రాజుగా జన్మింపవచ్చును. దరిద్రకుటీరమున బ్రాహ్మణవటువై జన్మింపవచ్చును. ఆయా జన్మలందు పూర్వసంచిత యోగ విశేషము అనుభవింపగలడు. వటువై జన్మించుట దుర్లభము అది ఉత్తమజన్మ. అట్టిజన్మకల్గగానే పూర్వపు యోగశేష మును అందుకొని ఆత్మయోగి కాగలడు. పూర్వాభ్యాస వశమున తనయంతట తాను అవశుడై ఆత్మనిష్ఠుడగును. ప్రయత్నపూర్వకముగా పరమేశ్వర యోగమునందాసక్తి కల్గిన వాడైనచో యోగసంసిద్ధినిపొంది ఉత్తమగతి భాజనుడగును. అనేకజన్మ సంసిద్ధుడై పాపరహితుడగును. ఆత్మయోగ మెన్న డును విఫలముకాదు. ఎట్టిదుర్గతియును అందు లేదు. కల్యాణ కర్మ అశుభమును సంపాదించదు.

## 40. యాతి పరాం గతిం 6—45

ఆత్మయోగమందు నిష్ణాతుడైన మానవుడు ఉత్తమగతిని పొందును. ఆత్మయోగము నవలంబించినజన్మయందే ఉత్తమ గతి రాకపోవచ్చును. అయినప్పటికిని ఉత్తరోత్తరము ఉత్తమ జన్మలభించును. అట్టి ఉత్తమజన్మవలన ఉత్తమవిధానమవలం బించి అనుత్తమపద్ధతిని పొందును. శ్రీకృష్ణభగవానుని దివ్య ధామము పరాగతి అనబడును. అట్టి నిరతిశయస్థానమునుపొందు టకు ప్రబలతరమగు యోగ్యతకావలయును. అట్టియోగ్యత

యంతయుఒకేజన్మయందు ఒకేవిధానమందుకలుగకపోవచ్చును. అయినప్పటికి హానిలేదు. ఒక్కొక్క-సమయమున సంపాదింప బడిన ఒక్కొక-విధానము ఒక్కొక్క-యోగ్యతను సంపాదిం చును. అవియన్నియుకలసి మహాయోగ్యతారూపమునుపొం దును. అట్టిసమగ్రమైన యోగ్యత ఆత్మయోగమనబడును. యోగ మవలంబించినవానియొక్క- మనోవృత్తి నిత్యము ఆత్మ విషయమై ప్రసారమునుపొందును. ఆట్టి మహాప్రసారమే ఆయోగికి దివ్యగతిని సంపాదింపచేయుచున్నది.

## 41. సహస్రేషు కశ్చి ద్యతతి 7-3

పరమేశ్వర యోగాసక్తుడై ప్రవర్తించు మానవుడు నిత్యమును పరమేశ్వరాశ్రయుడు కావలయును. అట్టి అనన్యభావముతో ప్రవర్తించినప్పుడే అసంశయముగా భగవద్రూపమును తెలుసు కొనగలడు. అనేక శాస్త్రముల అవలోకనము వలన నానా విధ విషయపరిజ్ఞానము కల్గును. అదియే ఆత్మానుగతమైన ప్పుడు అనుభవమున అనువర్తమైనప్పుడు విజ్ఞానమనబడును. విజ్ఞానసహితమైన జ్ఞానము భగవద్వ్యపాశ్రయములవలన పార మేశ్వర స్వభావమును దెలియుటకు అలౌకిక విజ్ఞాన మపేక్షి తము. ప్రాపంచిక పదార్థ సముదాయమంతయు చరాచర విశ్వమంతయు పరమేశ్వర రూపమే. అయినప్పటికి మాయా చ్ఛన్న స్వభావముతో నిజస్వరూపము తెలుసుకొనక వ్యథ పడుచుండును. కేవలము క్షుద్రప్రపంచ భావములతో కూడు కొని పరమేశ్వర దృష్టినే మరచిపోయిన ప్రాణిలోకము

వ్యథపడుచున్నది. ఆవ్యథను వ్యథారూపమున అనుభవింపను కాని కాలక్రమమున అది అట్లే గోచరమగును. కాలక్రమమున నది అట్లవభాసించి అవభాసించి పరమేశ్వరదృష్టిగా ఉత్పన్న మగును. వ్యథానుభవము అధికముకాగా పరమేశ్వరానురక్తి అధికమగును. అనేక ప్రాణికోటులలో ఏఒక్కడో కాని అట్లు చేయజాలడు. అట్టివారిలోకూడ యేఒక్కడో పారమేశ్వర కృత్యము లాచరించును. అట్లాచరించువారిలో నూటికొక్కడు తగినప్రయత్న మాచరించును. ప్రయత్న మాచరించినప్పటికి అవిశేషముగా అందరకును సమానవిజ్ఞానముండదు. ప్రాక్తన సంస్కారము ప్రబలముగా నున్నప్పుడు పరమేశ్వర ప్రణయ మతిశయించును. ఉపదేశ మహత్వము పరమేశ్వరానుగ్రహము పరిసర ప్రభావము ఎవనికి తగిన విధానమున కూడుకొని యుండునో ఆతడే సమర్థుడు కాగలడు.

## 42. కశ్చి న్మాం వేత్తి తత్వతః 7-3

పరమేశ్వరారాధన మొనరించువారిలోకూడ అందరును సమ సామర్థ్యము కల్గియుండరు. స్వభావము భిన్నభిన్నమైఉండును. పరమేశ్వర ప్రయత్న మొనరించునట్టివారలలో కొందరే సిద్ధులు కాగల్గుదురు. అట్టి సిద్ధులలోకూడ అందరును పరమేశ్వర విజ్ఞానము కల్గియుండరు. మహాప్రయోజనమైనట్టి పరమేశ్వర విజ్ఞానముకొరకు ప్రయత్నించునపుడు అనేకములైన ప్రతిబంధములుదయించును. ఆప్రతిబంధ ప్రతిఘాతములను తరింపలేక కొందరు హతబుద్ధులై మరలిపోదురు. పట్టుదలతో

ఉత్తములగువారు ప్రయతన శూరత్వము వహించినప్పటికి మధ్యవ్యాహతులై ఆయాసిద్ధులందు అభిమానముకల్గి అంత ర్లక్ష్యమును విడనాడుదురు. అది ఉచితముకాదు. వాని నన్ని టిని పరిత్యాగమొనరించి పరమేశ్వర విజ్ఞానమే కావలయునని ప్రయత్నించువాడు ఏ యొక్కడో యుండును. పరమేశ్వరుడు సర్వసిద్ధి స్వభావుడని దృఢమగు విశ్వాసమున్నప్పుడు ప్రాపం చికములైన విషయముల దివ్యములైన సిద్ధులందభిలాష కలవారుకారు. అందుచే వాస్తవస్వభావమున శ్రీకృష్ణ విజ్ఞానముపొందదలచిన మానవులు అత్యంతము విరతులై ఉందురు. సంసార మొకమృత్యుముఖము. అచటిద్వార మత్య ల్పము. ఒకొక్కడే కాని అందుండి విడిపడిపోజాలడు. మహా సిద్ధికై ప్రయత్నించునప్పుడు ఎన్నియో విఘాతములుకల్గును. వానినన్నిటిని తరించినపుడే ఆవిషమపరీక్షలనన్నిటిని దాటి నప్పుడే బ్రహ్మసిద్ధికల్గును. కాని ఇట్టిఅనన్యమహాఫలమునకు ఏయొక్కడో అర్హుడై యుండును.

## 43. మే భిన్నా ప్రకృతి రష్ట థా 7–4

పరమేశ్వరప్రాప్తికొరకై ప్రయత్నించునట్టి ప్రాణిసముదాయ మంతయు ప్రపంచవిలాసముతో కూడుకొనియున్నది. ఎంతటి ఎట్టి ప్రపంచప్రగతికాని పరమేశ్వరునికన్న అతిరిక్తముకాదు. ఏదియేని విధమున అది పరమేశ్వరసంబద్ధమైఉండును. పర మేశ్వరుడు ద్వివిధప్రకృతిరూపమున నున్నాడు. ఒకటి పరా ప్రకృతి. వేరొకటి అపరాప్రకృతి. ఇవియే క్షేత్రజ్ఞరూపమున

క్షేత్రరూపమున చెప్పతగియున్నది. శివశక్తివిలాసము లనతగి నవియు ఈస్వరూపములే. అపరాప్రకృతి ఎనిమిదివిధముల భాసించుచున్నది. పంచభూతములు మనోబుధ్యహంకారములు. ఈఅష్టప్రకృతి అపరాప్రకృతిఅనబడును. ఇదియంతయు జడము. బ్రహ్మవస్తు వొక్కటియే ప్రవృత్తిసమున్ముఖమైనప్పుడు ప్రకృతిగా చెప్పబడును. అది సృష్టికథకంతకు మూలహేతువు .మహాచేతన సన్నిధానమున అనేకథాస్పందించి నానాత్వము పొందినది. మాయికమైన మహాస్పందమునకు నియతికాని వ్యవస్థకాని చెప్ప నలవికాదు. కాని అది అనియతముకాదు. అవ్యవస్థము కాదు. పరమేశ్వర నియతము పారమేశ్వర భావముచే వ్యవస్థితము. ఇట్టి ఈ ప్రకృతి పరతంత్రమైన ప్రాణిసముదాయ మంతయు ప్రాక్తనసంస్కారవిశేషము ననుసరించి ప్రవర్తించు చున్నది. నానాత్వమునకు భిన్నభావమునకు ఈమహాప్రకృతి మూలమైయున్నది. అపరాప్రకృతి ఎనిమిది విధములైనది. దీని కతిరిక్తముగా ఉన్న పరాప్రకృతి జీవరూపముగా తొమ్మిదవ దిగా పరిగణింపతగినది. బ్రహ్మతత్వము పూర్ణరూపమై నవాత్మకముగానుండుట తెలియతగియున్నట్లు భాసించును.

## 44. మత్తః పరతరం నాన్యత్ 7-7

శ్రీకృష్ణనిభగవానునికన్న అతీతమగునది ఏదియులేదు. శ్రీకృష్ణుడు సూత్రమువలె మణిగణము లనతగిన పదార్థములన్నిటి యందును అనుస్యూతుడైయున్నాడు. చైతన్యరూపమగునది పరాప్రకృతి. అదియే కృష్ణతత్వము. అదియే కారణముగా సర్వ

భూతములు స్వరూప ప్రతిష్ఠను పొందుచున్నవి. ఆ పరమేశ్వరుడు హేతువుగా ప్రపంచమునకు ఉత్పత్తి స్థితిలయములు గల్గుచున్నవి. ప్రపంచమంతయు పరమేశ్వరుడే. భావించువారలకు అన్నివస్తువులందును భాసించును. ఆతడు ప్రపంచ ప్రజ్ఞావిలాసమున కంతకును మూలహేతువు. ఆతనికన్న అతిరిక్తమగునది ఉన్నదనుకొనరాదు.

## 45. మయి సర్వ మిదం ప్రోతం 7-7

ఒకేదారమునననుసరించి అనురూపములగు మణులు అననురూపములగు మణులు కూర్పబడును. అట్లే పరమేశ్వరుని యందు పరస్పరానురూప్యము లేనట్టి ఎన్నియో పదార్థములు కూడుకొని ఉన్నవి. సర్వప్రపంచ వస్తువులందు పరమేశ్వరుడున్నాడనుటకన్న ఆయావస్తువులందు పరమేశ్వర భావన చేయుటకన్న వేరుగా మరియొక విధానమును మరియొకభావనయు కలదు. పరమేశ్వరునందే సర్వమును ఓతప్రోతమైయున్నది. పరమేశ్వరునికన్న అతిరిక్తముగా నేదియు వివిక్తమైన స్వరూపశోభ కల్గిలేదు. పరమేశ్వరునందు సర్వపదార్థముల చూచుటలో సర్వపదార్థములందు పరమేశ్వరునిచూచుటలో భావనా తారతమ్యములేదు, కాని అనుభవ సమన్వయమందు విశేషము పొడగట్టును. అన్నిటియందును ఆత్మభావన ఒనర్చినప్పుడు సర్వలక్ష్యము ఆత్మయైయుండును. అది ఉచితమగు విధానమే. సాధారణ ప్రాణిలోకము లన్నిటిని పరమేశ్వర మయముగా చూడలేకపోవచ్చును. పరమేశ్వరుని ప్రత్యావభాసములో భేదములేదు. అయినప్పటికి సాధక సౌలభ్యము

నకు ప్రత్యేకముగా నిర్దేశించుట సముచిత పక్షము. రసరూప మున ప్రభారూపమున ప్రణవముగా శబ్దముగా గంధముగా తేజస్సుగా జీవనముగా తపస్సుగా బీజముగా పరమేశ్వరుడు తెలియతగి యున్నాడు.

## 46. మమ మాయా దురత్యయా 7-14

పరమేశ్వరునికన్న భిన్నమనిగాని అభిన్నమనిగాని చెప్పుటకు శక్యముకాని పారమేశ్వరమగు మాయకలదు. దాని స్వభావ ము దురుపాదము. అది అనిర్వచనీయ స్వభావము. సాత్విక రాజసతామసభావము లన్నియు పారమేశ్వరములే. పరమేశ్వ రుని మాయావాగురముదాట శక్యముకాదు. మాయాసము త్పత్తియందే మహావిభ్రాంతి మహామోహము ఆవరించుచున్నది. మాయాసమాహృతమైనట్టి లోకము నష్టజ్ఞానమగుచున్నది. జ్ఞానము నశింపగా మాయాస్వభావముకూడా ఏమిదో తెలి యదు. తత్స్వరూపమే సరిగా తెలియనపుడు దానిని తరించుట శక్యముకాదు. మాయాస్వభావము స్పష్టముగా అవగత మైనచో తదతీతమైన ప్రజ్ఞ హృదయమునందు కల్గినచో మాయను తరింపవచ్చు. కాని అది శక్యమగుటలేదు. పర మేశ్వరమాయ దురత్యయము. అంతమాత్రమున లోకము నిర్విణ్ణముకారాదు. పరమేశ్వరుని అనన్యభావముతో ఆరా ధించువారు మాయను తరింపగలరు. పరమేశ్వరభావప్రాప్తి మాయాతీతమగు స్వభావము సంపాదించుచున్నది. ఏమా త్రము మాయాసంబంధములేని పరమేశ్వరజ్యోతి ఉపాసించు

వారికి అవ్యాహతమైన ప్రాభవమును సంపాదించును. సామాన్యముగా ప్రపంచగతియందు కొట్టుకొనిపోవు మానవులకు పరమేశ్వరమాయ అతిక్రమింప శక్యముకాదు.

## 47. చతుర్విధా భజంతే మాం 7-16

పరమేశ్వరమాయ దురతిక్రమణీయమైనను తదతిక్రమణము నకై అనేకులు ప్రయత్నింతురు. అట్లు ప్రయత్నించువారి యొక్క చిత్తవృత్తి స్వభావము వివిధముగానుండును. కాబట్టి నానావిధముల ధ్యానింతురు. వారందరును సుకృతులు. జన్మాంతర పుణ్యపరిపాకమున్నప్పుడే భగవద్భజనభావము కల్గును. భగవానుని సేవాసక్తులైనవారలలోకూడ అనేక విధములగు భావములుండును. కొందరు సహేతుకముగా ధ్యానింతురు. కొందరు నిర్హేతుకముగా భజింతురు. నిర్హేతుక భజనమే ముఖ్యమైనది. సహేతుకవిధానము అంతగా ప్రశంస నీయముకాదు. భగవద్భావమును క్షుద్రమైన ప్రయోజన నిర్వహణమునకై ఉపయోగించుకొనరాదు. కొందరు ఆర్తులై భగవానుని ధ్యానింతురు. గజేంద్రుడార్తుడు. ద్రౌపది ఆర్త నాదముతో ఎలుగెత్తి కృష్ణునిధ్యానించినది. కొందరర్థార్థులు ఏదియేని ప్రయోజనమాకాంక్షించి భగవానుని సేవింతురు. ధృవుడర్థార్థి. ఆర్తుడు అర్థార్థియు సహేతుకభజన మొనర్చు వారైనను అట్టి విధానములందుకూడ అహంకారపరిత్యాగము అపేక్షితమైయున్నదని గ్రహింపవలయును. కొందరు తత్త్వ జిజ్ఞాసులై పరమాత్మధ్యానమొనరింతురు. ప్రహ్లాదుడు జిజ్ఞా

సువు. కేవలజ్ఞానతత్వముతో పరమేశ్వరుని తెలుసుకొనువారు కొందరుకలరు. వారు జ్ఞానులు. అర్హతాభేధమునను సరించి ఈ విధానములన్నియు సముచితములే. సహేతుకానుష్ఠానము వలన నిర్హేతుకభక్తి ఉదయించును. దానిపరిణామమందు జ్ఞానరూపముకల్గుట అవశ్యంభావి. కాగా పరమేశ్వరుని భజించువారు సామాన్యముగా నాల్గువిధములుగా నుందురని చెప్పవచ్చును. ఈనాల్గువిధములు ఆదర్శరూపములుగా భక్తి విధానములను ప్రధానదృష్టితో నాల్గువిధములుగా గ్రహింపవచ్చును. వీనియందవాంతరవిభేదములకూడ గ్రహించుట కవకాశమున్నది. ఒకొ-క-ప్రభేదమందు సూక్ష్మయుక్తి ననుసరించి అవాంతరాంతర విభేదములను అనేకముగా గ్రహింపవచ్చును.

### 48. జ్ఞానీ త్వాత్మైవ మే మతం 7–18

భగవద్భక్తులందరును ఉదారులే. జ్ఞానియగువాడు పరమేశ్వరుని సచ్చిదానందాత్మకునిగా తెలుసుకొనును. కేవలము జ్ఞానరూపునిగా భారూపునిగా అవగతముచేసికొనును. పరమాత్మను స్వరూపజ్ఞానముగనే భావించును. అదియే అనుత్తమగతిగా ధ్యానించును. ఆతని అనన్యయోగమందు అప్రత్యయము కాని విప్రత్యయముకాని ఉండదు. అనేక జన్మ సంశుద్ధతకల్గిన కాని జ్ఞానముత్పన్నముకాదు. అంతటను శ్రీకృష్ణుని భావించువాడు దుర్లభము. తదితరులందరును ఆయాకామోపహతచేతసు-లై అన్యదేవతల నారాధింతురు. ఎవరెవరు

ఎట్టి యెట్టి భావమున ఆరాధించినను వారలను భగవానుడు ఆయావిధమున అనుగ్రహించును. వారలకు తదనుగుణమైన శ్రద్ధను కలుగచేయును. జ్ఞానియగువాడు వీరియందరకును అతీతుడై స్వాత్మభావనతో పరమేశ్వరుని అర్చించువాడగును. అంతను విజ్ఞానభావముతో చూడగల్గుట సాధారణకృత్యము కాదు. ఆవిధానము ఆనందసేవకు దగ్గరలోనుండును. అందుచే జ్ఞాని ఉత్తముడు.

## 49. సర్వేషు కాలేషు మామనుస్మర 8-7

సర్వనియతకాలములందును తనను స్మరింపవలసినదని కృష్ణ భగవానునియాదేశవచనము. జ్ఞానసాధనతో భగవానుని భజించుట యుత్తమపక్షము. ఆప్రణాళిక సామాన్యముగ లబ్ధ ముకాదు. దానికొఱకై భగవానుని శరణుపొందవలయును. భగవన్ముఖముగా సర్వక్రియలను నిర్వర్తింపవలయును. స్మర ణము మానసధర్మము. మనోరసమునందు భగవానుని దివ్య రూపమును నిరతము భావింపవలయును. తనకు కలుగబోవు నట్టి విధానములందు నానావిధములయిన యడ్డంకులుండ వచ్చును. వానిని అసమర్థుడైన తాను నివారించుకొనజాలడు. ఆప్రతిబంధముల నివారణమున్నగాని శ్రేయోమార్గము నిష్కంటకముకాదు. ఆప్రతిఘాతముల బోగొట్టుటకు భగ వానుడే సమర్థుడు. భగవానునితో దివ్యసంబంధము కలుగ జేసికొనుటకు నిరతము స్మరణచేయవలయును. ఆస్మరణము మానవునకు భగవదీయత్వమును సాధించును. అపుడు భగవా

నున కిష్టుడుకాగలడు. భగవానుని స్మరించుటకు స్వరూపనిశ్చయముండవలయును. భగవత్స్వరూప మధ్యాత్మముగను అధిభూతముగను అధిదైవముగను అధియజ్ఞముగను నుండును. భగవానుని దివ్యస్మరణోపాయము ఆయారూపముల నన్నిటిని అవగతముచేయగలదు. నిశ్చితమైన స్వరూపనిధ్యానముతో నిరంతరప్రసక్తి కలిగియున్నచో స్మరణయొనర్పగల సామర్థ్యము సిద్ధించును. అప్పుడే భగవద్భక్తుడగును. నిరంతర స్మరణచేయవలయునని విధివాక్యము. అట్టి సామర్థ్యము కల్గుటకు విహితకర్మల నాచరింపవలయును. సామర్థ్యముకలిగిన పిమ్మట కర్మల త్యజించుట యుచితముకాదు. లోకసంగ్రహము నకు వాని నవశ్య మాచరింపవలయును. కర్మప్రభావమువలన అంతకాలమునందును స్మరణచేయుశక్తి కలుగగలదు. పరమేశ్వరస్మరణముచేయుచు శరీరమును త్యజించువాడు భగవద్భావము పొందును. సంశయములేదు. మానవునకు సామాన్యముగా స్మరణాధీనమైన సిద్ధి కలుగుచుండును. స్మరణమువలననే తద్భావభావనకల్గును. అందును అంతకాలమునందుండు స్మరణానుసారమున ప్రాప్తి సిద్ధమగును. అంతకాలమందు భగవచ్చింతనముకల్గుటకు భగవానునియందు మనోబుద్ధుల స్థిరము చేసికొనినవాడు కావలయును. మనస్సున కభ్యాసయోగయుక్తిని సాధించియుండవలయును. చిత్తము ననన్యగామిగా చేయవలయును. అప్పుడే నిరంతరచింతన చేయగలవాడగును. పూర్వాభ్యాసములేని పూరుషుడు మృత్యుసమయమున నితరులచే బోధింపబడియు పరమేశ్వరుని చింతింపజాలడు. ప్రాణ

ప్రయాణకాలమును అనన్యయోగి తెలియగలడు. ఆసమయ మున నచలమనోనిష్ఠతో అనన్యభక్తితో యోగబలముతో ప్రాణవృత్తిని భ్రూమధ్యమునకాకర్షించి రూపనిధ్యాన మొనరించుచు పరమపురుషుని చింతన మొనర్చినచో శాశ్వతపదమును పొందును. ఇట్టి స్మరణసిద్ధికి వీతరాగత్వము బ్రహ్మచర్యము మొదలగునవి సాధనములు.

## 50. స యాతి పరమాం గతిం 8–13

స్మరణమున గలుగుసిద్ధికన్న అక్షరయోగధారణలో పరమగతి ప్రాప్తియున్నది. ప్రణవయోగావలంబన మొనర్చువాడు పరమ గతినిపొందును. అక్షరయోగము వెంటనేసిద్ధింపదు. తత్పూర్వ సాధనము లనేకములుగలవు. వానియందు సిద్ధికలిగినపిమ్మట నక్షరయోగము నవలంబింపవలయును. అక్షరోచ్చారణ సామర్థ్యమున్నంతమాత్రమున యోగావలంబమురాదు. ప్రణవ పరిపాటిని పరిశీలించి తద్విభాగము నవలోకించి దాని ధారణ విధాన రహస్యముల తెలిసికొని సృష్టి సంహార ప్రక్రియలందలి సూక్ష్మగతిని అనుభవించినగాని యక్షరయోగము సిద్ధముగాదు. ఇట్టి సతతాభ్యాసికి ప్రాణప్రవృత్తి గోచరమగును. నిష్క్రమణము తెలియును. బహిశ్శరీరము సమయగతినిబట్టి వివశమయినను మనస్సుకాసామర్థ్యముకలుగును. మనస్సు సూక్ష్మగతిలో కూడుకొని అక్షరనిధ్యానము చేయగలదు. ఆ సమయమందు సర్వద్వారములను నిరోధించి మనస్సును హృదయమందు నియమింపవలయును. ఇదివరలో భ్రూమధ్యస్థానమునరకు అభ్యాస

దార్ఢ్యమున ప్రాణమును ఆకర్షింపకల్గినమానవుడు ఈ అక్షర యోగధారణలో ప్రాణమును సహస్రారమందు నిలుపగలడు. ఆవిధమున సహస్రారకర్ణికయందు ప్రాణమునునిల్పి కేవల ప్రణవమాత్రమునే వ్యాహరించుచు తురీయాంశమును భావించలయును. ఆసమయమందే దేహమును పరిత్యజింప వలయును. ప్రాణప్రవృత్తికి అట్టి ఊర్ధ్వగతిలో యోగపటిమ వలన ప్రణవనాదములో లయమును సంపాదింపవలయును. ప్రణవము బ్రహ్మకోశము. ప్రణవమందు నాదాంతములో సంపుటితమై భాసించునట్టి పరమాత్మను అనుస్మరణముచేసి నచో పరాగతిప్రాప్తికల్గును.

51. మాముపేత్య పునర్జన్మ న విద్యతే 8—16

పరమాత్మభావమును పొందిన మానవునకు పునర్జన్మలేదు. అనన్యచేతస్కుడై పరమాత్మస్మరణము నిత్యము చేయునప్పుడు నిత్యయోగికాగలడు. ఆనిత్యయోగికి పరమాత్మసులభుడు. అవిద్యకమైన సృష్టిఅంతయు అప్పటిలో నశించును. అందు వలన స్వస్వరూపముగానున్న సచ్చిదానందాత్మకమగు పరబ్రహ్మభావము ఆవిర్భవించును. అట్టియపుడు దుఃఖా లయమైన మాయాసృష్టి ఏమాత్రమును కల్గదు. పరమ సంసిద్ధి సంప్రాప్తమైనప్పుడు మరల అశాశ్వతపదమును పొందుట ఉండదు. బ్రహ్మభువనపర్యంతముకల లోకము లన్ని యు పునరావృత్తి కలవియే. పరమాత్మపదము పునరావృత్తి రహితము. జననమరణాదులన్నియు మాయాప్రపంచమం

దున్నవి. మాయాతీతభావమును పొందినప్పుడు మాయికభావమేమియు నుండదు. మాయికమైన సర్వభూతములు నశించినప్పటికి సర్వహేతువైన ఆత్మతత్వము నాశముపొందదు. అది అవ్యక్తమగు పరమగతి. దానినిపొందినవారలకు నివృత్తిలేదు. జననములేదు. మరణములేదు. నిత్యానందమే అచట స్వభావము.

52. భక్త్యా లభ్యస్త్వనన్యయా 8-22

మానవుడు మాయాతంత్రమందు పడిపోయినాడు. ఆత్మసముద్ధరణమునకు భగవదనుగ్రహములేక ఎన్నివిధముల తాను ప్రయత్నించినను సమర్థుడుకాజాలడు. కావున ఈశ్వరానుగ్రహము అవసరము. భక్తియుక్తుడైనకాని ఈశ్వరానుగ్రహము కల్గదు. భక్తివిధానమందును అనేక భేదములు కలవు. పూర్వపూర్వపురాణభక్తులనన్నిటిని అవలంబించినగాని ఉత్తమమైన అనన్యభక్తికల్గదు. భక్తిబీజము హృదయమునందు కల్గుటకుకూడ నియతకర్మ లపేక్షితములైయున్నవి. వానివలన గౌణభక్తి ఉదయించును. గౌణభక్తితో పరమేశ్వరార్చనము ప్రాధాన్యము పొందును. శరీరములో ఒనర్పవలసినట్టి భక్తివిధానములు వాక్కులో చేయవలసిన భక్తివిశేషములు మనోనిగూఢిలో తెలియతగిన భక్తిరహస్యములు అనేకములుకలవు. ఉత్తరసిద్ధికి పూర్వపూర్వానుసరణము అన్నిటిలోవలె ఇచటకూడ అపేక్షితము. ఆధిభౌతికములైనభక్తులు ఆధిదైవికములైనభక్తులు ఆధ్యాత్మికములైన భక్తులుకలవు. భక్తిపరిణామములో ఆత్మిక

మైన మనోరససిద్ధి సర్వప్రధానమై యున్నది. అచటి అనన్యభావములో నిరంతరనిష్ఠలో పరాభక్తి ఉదయించును. ఆ భక్తిలో కూడ మలినరసభక్తి శుద్ధరసభక్తి యున్నది. ఇతరభావములతో కూడుకొనినభక్తి మలినమగును. కేవలము ఆత్మభావనతో కూడుకొనినభక్తి అమలినము ఇదిసహజభావము ఇదియే అనన్యభక్తి యనబడుచున్నది. ఇట్టి అనన్యభక్తిచేతనే భగవానుడు లభ్యుడగును.

### ౫౩ యోగీ పరం స్థాన ముపైతి ౮-౨౮

పరమాత్మ పదమునుపొందుటకు అనేకగతి విశేషములున్నవి. మరల ఆవృత్తిని సంపాదించుగతులుకొన్ని అనావృత్తుల సంపాదించుగతులుకొన్ని. ఇవియే కృష్ణ శుక్లగతులనబడును. కృష్ణగతిని పొందినపుడు ఆవృత్తిఉన్నది. శుక్లగతిలో ఆవృత్తి లేదు. సామాన్యముగా ప్రతివిషయమునను భిన్నపరిస్థితులుండును. ఆ పరమాత్మ పదప్రాప్తిలోకూడ రెండుమార్గములున్నవి. ఇవి పరస్పరము భిన్నముగా కన్పబడినను వాని లక్ష్యమొకటియే. గతిగమ్యమును ఏకముగానిశ్చయించుకొనగల్గిన మానవునకు ఏమియు వ్యామోహములేదు. కాని అట్టి సామర్థ్య సంపాదనకు యోగావలంబన మపేక్షితము. ఆయాగతులందు ప్రసరించుటకు కూడ ఆత్మయోగమును పొందవలయును. సర్వకాలములందును ఆత్మయోగమును అవలంభింప వలసి యున్నది. వేదములలో యజ్ఞములలో తపోవిధులలో దాన ప్రసంగములలో నిర్దేశింపబడిన పుణ్యఫలము ఏమాత్రమును

దీనికిసమానముకాదు. నిరతము యోగాసక్తుడైనట్టి మానవుడు నానావిధ పుణ్యఫలములనన్నిటిని అతిక్రమించి అనుత్తమమైన ఆద్యస్థానము పొందగలడు. ఆత్మపదప్రాప్తికై అనేక మార్గములున్నవి. అవియేవియు భిన్నలక్ష్యములుకావనియు నిరూపితమైన విషయము. అర్హతానుసారమున ఆయాగతిని అనుసరింపవచ్చును. ఉత్తమార్హతకల్గిన మానవుడట్టిగతిని అనుసరించినప్పటికి పునరావృత్తిరహితమైన శాశ్వతపదమును పొందగలడు. ఏవిధానమైనను ఆత్మగతిని పొందించునదై యున్నది. అవిద్యావినాశముకల్గినగాని ఆత్మగతి సిద్ధముకాదు. అవిద్యాప్రభావ మనేకవిధములుగా నుండవచ్చును. కాబట్టి వానిని నశింపచేయుసాధన సంపదకూడ విభిన్నమై ఉండవలయును. అందువలననే అనేకగతులు నిర్దేశింపబడుచున్నవి. పరమలక్ష్యమును భావించునట్టి మానవుడు ఏవిధానమునైన అవిద్యను నశింపచేసికొనగలడు. అందువలన అవశ్యముగా పరమపరసిద్ధికల్గుచున్నది. ఉత్తమసంపద కల్గినప్పుడు వేనిని ద్వేషింపడు. అట్టివాని అర్హతాసంపత్తిసాధనములను మానవులవలంబింపవలయును. అదియే తరణమునుసూచించును.

## 54 కృత్స్న మవశం ప్రకృతేర్వశాత్ 9-8

జగమంతయు పరమేశ్వరాధీనము. పరమేశ్వర ఇచ్ఛానుసారమున సర్వమును ప్రసరించును. ఇట్టి విషయవివేకము విజ్ఞానయుక్తి యున్నప్పుడుగాని కల్గదు. అశ్రద్ధధానులగు పురుషులు మృత్యుసంసార మార్గమందు ప్రవర్తింతురు. సర్వవిశ్వమును

పరమాత్మ వ్యాప్తమైయున్నదని వారు తెలియజాలరు. అవ్యక్త స్వభావముతోనున్న పరమేశ్వరుడు జగదంతర్యామియై ప్రకాశించుచున్నాడు. అజాతవిధానము నవలంబించి చూచి నచో పరమాత్మయందు భూతలోకములుండుటగాని భూతము లందు పరమాత్మయుండుటగాని ఏమియులేదు. ఈ ప్రపంచ మంతయు భ్రాంతము. భ్రాంతి తొలగిపోయినప్పుడు సర్వ ప్రాణులకును భగవద్భావమే సిద్ధమగును. భ్రాంతి ఉదయించి నప్పుడు సృష్టియున్నది. అభ్రాంత భావములో సృష్టి లేదు. ఈ మహావిభ్రాంతి కంతకును విశ్వమాయ హేతువు. అది ఆత్మకు వశంవదమై యుండును. అది ప్రకృతి. ప్రకృతి జడము. జడము నకు స్పందభావము లేదు. ఆత్మనిత్యచేతనము. ఆచేతనసన్నిధాన మున జడమనేక విధముల స్పందించి విశ్వరూపము పొందు చున్నది. విశ్వస్థిత ప్రాణికోటియంతయు ఆ మాయా వాగుర మందు చిక్కుకొనియున్నది. భూతగ్రామమంతయు ప్రకృతికి వశంవదమైపోయి అవశమైయున్నది. ప్రకృతి నిర్ముక్తమైన స్వభావము ఏప్రాణికిని లేదు. ప్రకృతి పరతంత్రమై ప్రాణి వృత్తి ప్రసరించు చున్నది. పంచభూతముల ప్రభావము పరి సరముల విశేషము మానవుని అవశుని చేయుచున్నవి. పరమా త్మను మాయ లోబరచుకొనజాలదు. మానవుడు ఆత్మభావము పొందినప్పుడు ప్రకృతికతీతుడు కాగలడు. ఉదాసీనుడై ప్రకా శింపగలడు.

### 55 క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి 9-21

మానవులాత్మభావప్రాప్తికై నిత్యము ప్రవర్తింతురు. రాక్షసీ ప్రకృతి వారిని ఒకప్పుడు వ్యామోహపెట్టుచున్నది. మహాత్ములగువారు దైవీప్రకృతి ననుసరించి అనన్యమనస్కులై భగవానుని భావింతురు. కీర్తన మొనర్చువారు దృఢవ్రతులగువారు నమస్యయొనర్చువారు వరివస్య చేయువారు తపస్యనాచరించువారు—ఇట్లనేకులుందురు. జ్ఞానయజ్ఞమున యజించువారును కలరు. త్రైవిద్యులై వేదవాదాసక్తులై స్వర్గతిని ప్రార్థనచేయుచు యజ్ఞములతో యజనముచేయువారున్నారు. వారి వారి సత్కర్మల ఉత్తమఫలానుసారముగా పుణ్యలోకములు ప్రాప్తములగును. దేవలోకమందు దేవభూయముపొంది దేవభోగములను అనుభవింతురు. కాని అవియన్నియు శాశ్వతములుకావు. కర్మసిద్ధమెన్నడును నిత్యముకాదు. కర్మబలానుసారమున అది ప్రవర్తించును. కర్మబలము ప్రక్షీణమైనప్పుడు దేవభోగానుభవము కూడ ప్రక్షీణకల్పమగును. పుణ్యము క్షీణింపగా స్వర్గలోక ఫలము లేకపోగా శేషపుణ్యానుసారమున మర్త్యలోకమును పొంది తగినజన్మ నెత్తుదురు.

### 56. నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం 9—22

త్రయీధర్మమును పొందువారు కామకాములై యుందురు. గతాగతమును పొందుచుందురు. అట్లనేక పరంపరలో సత్కర్మ నాచరించినపిమ్మట అనన్యచింతన ముదయించును. అనన్యచింతనముతో కూడుకొనిన మానవులు పరమేశ్వరుని

ఉపాసించుటను చక్కగా తెలియగలరు. ఉపాసనాపద్ధతి యందు కూడుకొని, నిత్యాభియుక్తులగుదురు. కాయికముగా నొనర్చినట్టి విశేషవిధులన్నియు సఫలములై వాచికవిధాన మం దనుషక్తములగును. ఆరెండును అనుగతపరిపాకము పొంది మానసవిధిలో నిరూఢములగును. ఆసమయమున అనన్యనిష్ఠతో కూడుకొనినట్టి నిరంతరచింతన ముదయించును. అట్టి సంతతమైన భగవత్ స్మరణలో లుర కేవియు కాంక్ష లుండవు. నిత్యము అనన్యయోగనిష్ఠయే వారల కభీప్సితము. కాని ఇతరములనేమియు కాంక్షింపరు. భౌతికమగు నాశయే వారలకుండదు. తమకు శరీరముకలదనికూడ వారుభావింపరు. ఇదివరలో తమదిగా భాసించినను శరీరము, సంపద, సర్వ మును భగవానునికి సంబంధించినదియే అని భావింతురు. అట్టి నిత్యాభియుక్తులగు వారలను భగవానుడే పరిపాలించును. వారల యోగక్షేమములను ఆతడేచూచును. ఏస్థానమున ఆతడున్నను భగవానున కాతడు దూరస్థుడుకాడు. పర మేశ్వరున కాతడు అత్యంతము ప్రియుడు. భగవానుడు తప్ప ఇతరమేమియులేదు. అంతయు పారమేశ్వరమే అనునట్టి అనన్య దీక్షానిష్ణాతుడు సర్వ మనుకూలముగనే భావించును. సర్వ మును ఆతనికట్లనుకూలము చేయుటలో భగవానుడే శ్రద్ధ వహించును.

57 యాంతి మద్యాజినోఽపి మాం 9-25

అవ్యక్తమూర్తియగు పరమాత్మను అందరును ఆరాధింప జాలరు. అట్టి అర్హతకల్గిన ఉత్తములే అనన్యనిష్ఠ కల్గియుందురు.

అన్యదేవతలను అరాధించువారుకూడ స్వార్థబుద్ధిలేక శ్రద్ధాయుక్తులై ఆరాధించుచో ఆ ఆరాధన పరమేశ్వరునకే చెందును. నిఖిలదేవతలందును ఆత్మరూపముగా భాసించునట్టి పరమాత్మనే అట్టి వా రారాధించినట్లగుచున్నది. సాక్షాత్తుగా విధివిధానానుసారముగా వారు పరమాత్మను యజనముచేయక పోయినను అన్యదేవతలనే ఆరాధించినను ఆత్మనే ఉపాసించిన వారగుచున్నారు. అన్నివిధానములందును పరమేశ్వరుడే ప్రభువు. పరమేశ్వరుడే భోక్త. ఇట్లు పరమాత్మస్వభావమును తెలిసికొనజాలకపోయినచో మూఢులై తత్వపతనము పొందుదురు. దేవవ్రతులు దేవతలను పొందుదురు. పితృసమారాధన చేయువారు పితరులను పొందుదురు. ఆయాభూతముల నారాధించువారు ఆయా భూతప్రభావములను పొందుదురు. అన్నిటను శ్రద్ధయే ప్రధానము. శ్రద్ధాయుక్తిలో యేవిధానము నవలంబించినను లక్ష్యముసిద్ధించును. భగవానుని యజించువారు భగవద్భావమునే పొందుదురు. అందరికన్న సర్వప్రధానమూర్తియగు వాడు పరమేశ్వరుడే అనెడు విజ్ఞానమందరకు కలదు. తదారాధనము సర్వారాధనమగునని అందరును తెలియవలయును. కాబట్టి ఆ భగవానునే సర్వవిధులందును శ్రద్ధాయుతముగా ఆరాధింపవలయునని బోధింపబడుచున్నది.

## 58. తత్కురుష్వ మదర్పణం 9-27

భగవదారాధనముచేయువారు అనేకవిధానము లవలంబింతురు. ఎన్నివిధానములం దైనను భక్తిని ప్రదర్శించుటయే ముఖ్యము.

బాహిరవస్తువులయందు శ్రద్ధ ఉచితముకాదు. మానసవిధానము కన్న ఇతరవిధానములందు ప్రాధాన్యముండరాదని భావము. పత్రముకాని పుష్పముకాని ఫలముకాని జలముకాని భక్తిచే సముపహృతముకావలయును. నియతితో కూడుకొని సమర్పింపవలయును. దానిని భగవానుడాదరమున గ్రహించును. మానవుని సర్వవిధానములందును భగవద్భావము అతిశయితమై యుండవలయును. తా నొనరించిన కర్మలకు ఫలము నాకాంక్షింపరాదు. తాను ఏమేమి ఆచరించినను దాని నంతను భగవానున కర్పణముచేయవలయును. తాను భుజించునది భగవన్నివేదితమై యుండవలయును. భగవానుని ప్రీతికై తాను కర్మల నాచరించుచుంటినని తాను భుజించుచుంటినని హోమము చేయుచుంటినని, ధానమొనరించుచుంటినని తపమొనరించుచుంటినని తలచవలయును. తన ప్రతికర్మయు భగవానుని ఉద్దేశించినది కావలయును భగవదుద్దేశముతో ప్రవర్తించిన జీవితప్రణాలికలో పాపకర్మమేమియు నుండదు. తానాచరించు కర్మసామాన్య మంతయు భగవద్భావముతో కూడుకొనినప్పుడు కర్మబంధనము లేవియునుండవు. శుభాశుభకర్మలు సంబంధింపవు. అంతను భగవదర్పణముచేయుట సన్యాసయోగము. దాని వలన విముక్తినిపొంది మానవుడు పరమాత్మభావమును బడయగలడు.

## 59 సమోహం సర్వభూతేషు 9-29

భగవానునకు ద్వేష్యుడుకాని ప్రియుడుకాని లేడు. భగవచ్చైతన్య మన్నిటియందును సమానవిధానమున భాసించును. కాని అవగాహనముచేసికొను వారియందు భేదముండును. అది అంతయు ఔపాధికము. ఔపాధికమెన్నడు వాస్తవముకాదు. పరాత్పరుని సమభావమును తెలిసికొని భక్తితో నారాధించుట సముచితము. పారమేశ్వరభావము ఔపాధిక ప్రకృతులందు స్ఫుటముగా అవభాసించును. సమభావముననుండు పరమేశ్వరుడు తనను భజించువారియందు అభివ్యాపియైయుండును. తనను భజింపనివారియందు అట్లుండకపోడు. భగవానుని సమభావమును తెలిసికొని ప్రవర్తించినవారియందే అదిస్ఫుటమగును. స్ఫుట చైతన్యమును అవభాసింపచేసికొనుటయే మానవునకు కర్తవ్యము. అంతఃకరణమాలిన్యము తొలగిపోయినప్పుడు స్పష్టావభాసముకలుగును. దురాచారుడైనను ఇతర వ్యాపాశ్రయములేక ఆరాధించునప్పుడు సాధు జనుడనియే చెప్పతగును. కేవలము అట్టి సాధుత్వముతోడనేకాక కాలుష్యమునుపోగొట్టుకొని, నిరంతర నిష్ఠతో ననుభవించుటయే కర్తవ్యము. సర్వభూతములందును పరమాత్మ సముడైయున్నను తదవగాహము చేసుకొని ప్రవర్తించుట ఉచితమైయున్నది.

## 60. నమేభక్తఃప్రణశ్యతి 9-31

భగవద్భక్తు లనేకులుందురు. భగవానుని ఆరాధించు భక్తునకు ఎన్నడు నాశము లేదు. తననుభజించువారిని పాపములను

పోగొట్టి పరమేశ్వరుడనుగ్రహించును. భగవద్భక్తునకు వినాశ
ములేదని అర్జునుడు ప్రతిజ్ఞచేయవలసినదిగా శ్రీకృష్ణుడాజ్ఞా
పించుచున్నాడు. అర్జునుడు కృష్ణభక్తుడు. ఆత డనన్యశరణు
డగుటవలన ఎట్టి ప్రణాశమును అతనికిలేదు. తాను దృష్టాంత
ముగా నిఖిలప్రాణులకును భగవద్భక్తియున్నచో హానిలేదని
అర్జును డుద్ఘోషింప తగును. అన్నిటిని విడనాటి భగవానునే
భజించునప్పుడు వినాశముకల్గునని అనుకొననక్కఱలేదు. తనకు
కల్గునట్టి అనుకూలప్రతికూల సంఘటనలలోకూడ పరమేశ్వర
నిరతుడై తాను ప్రయత్నింపవలయును. అనన్యమైన భగవద్భక్తి
కలవానికి ఆత్యంతిక వినిపాతమెన్నడును లేదు.

## 61. మత్తస్సర్వం ప్రవర్తతే 10-8

భక్తుడగువానికి పరమేశ్వర స్వరూప స్వభావములు స్పష్ట
ముగా తెలియవలయును. భగవద్భావముతో కూడుకొన్నట్టి
మహనీయుల స్వరూపసంస్థితిలోకూడ మానవస్వభావమును
బట్టి కేవలము పరమాత్మోపాసన సాధ్యము కాకపోవ
చ్చును. పరమేశ్వరతత్వముతో కూడుకొనిన అనేకస్వరూప
ములు పారమేశ్వరములుగా భాసించినట్లైన సాధకునకు సౌలభ్య
ముండును. ప్రపంచ ప్రభవాదులకు పరమేశ్వరుడు హేతువు.
పరమేశ్వరునివలననే సర్వమును ప్రవర్తించుచున్నది. పరమేశ్వ
రుని నియమానుసారముగా ప్రవర్తించునట్టి లోకమంతయు
పరమేశ్వరాధీనమైయుండును. తదధీనసామగ్రిని తద్రూపముగా
భావించుట ఉత్తమమగుసాధన. అందరకును ఆదికారణుడైన

లోకమహేశ్వరుని అసమ్మూఢులై తెలిసికొనినచో పాప విముక్తినిపొందుదురు. మహర్షులు మనువులు ప్రజలు అందరును పరమాత్మనుండి ఉత్పత్తిని పొందినవారే. పారమేశ్వరభావమును తెలుసుకొనుటకు సమర్థములైనట్టి శమదమాదులు కూడ నానావిధములైయున్నను పరమేశ్వర సముద్భూతములే అని తెలియవలసియున్నది. సర్వహేతువుగా పరమేశ్వరుని తెలియుటయే భగవద్భజనము. ఆత్మభావసమన్వితులై పరమేశ్వరభావమును తెలిసి భజించువారు తద్భావమును పొందుదురు. పరమేశ్వర కారణకమైన ప్రపంచములో ప్రవర్తించు ప్రతి మానవుడును భగవచ్చిత్తుడై పరమేశ్వరప్రాణుడై అందరకును తత్వమును బోధించును. ఎన్ని ఎన్ని యే యే విధానములైనను పరమేశ్వరునుండియే వెలువడినవి అనెడు జ్ఞానమే శ్రేయః ప్రదమగును.

## 62 నాస్త్యంతోవిస్తరస్యమే 10-19

భగవద్విభూతు లనంతములు. ఆతనినుండి ప్రవర్తించినట్టి అన్ని పదార్థములందును ఆతడనుషక్తుడై యున్నాడు. అయినప్పటికి మానవుడు భజించుటకై సౌలభ్యము భగవన్నిర్ణీతమై యున్నది. భగవానుని ఆత్మవిభూతులన్నియు దివ్యములు. ఆ యా విభూతివిస్తరము ననుసరించి పరమాత్మ విశ్వమునంతను వ్యాపించియున్నాడు. భక్తుడు అన్నిటిని భావించుట కష్టము. ఏవోకొన్ని భావములందు భగవానుని విచింతనముచేయుట సులభమైన మార్గము. సర్వభూతములందును సంస్థితుడై ఆత్మ

రూపమున పరమేశ్వరుడున్నాడు. సర్వపదార్థములకును ఆది మధ్యాంతములుగా ఎన్నదగినవాడు పరమేశ్వరుడే. ఆతని విభూతుల కంతములేదు. మానవు డింద్రియ ప్రజ్ఞాధీనుడై యున్నాడు. ఆయా ఇంద్రియములకు గోచరించునట్టి విషయములందు భగవానుని భావించినచో విషయాసక్తి కలుగదు. విషయములందు హేయోపాదేయ భావముకాని గ్రాహ్యా గ్రాహ్య బుద్ధికాని ఉండదు. న్యూనాధికభావమును కలుగదు. చక్షుర్గ్రాహ్యమైన తేజస్సు పరమేశ్వరుడే. అట్లే శబ్దస్పర్శరూప రసగంధములు కూడ పరమేశ్వరరూపమే. వాని వానిని ఆయా విధముగా సాక్షాత్కరించుకొనునప్పుడు పరమేశ్వరచింతన మొనర్పవలయును. ఆవిధముగా సూర్య చంద్రాదులలో. దేవసృష్టిలో గంధర్వులలో మానవులలో పశుపక్ష్యాదులలో భూచరములలో జలచరములలో సరూపములలో నీరూపములలో మూర్తములలో అమూర్తములలో గుణిపదార్థములందు గుణములందు అన్నిటి యందును దివ్యవిభూతిభావము అవగాహము చేసికొనవలయును. సంపదుపేతము బలసమేతము ఐశ్వర్యసహితము అగునదంతయు పరమేశ్వరాంశ సంభవమే. ఆయాపదార్థములందు నిర్దేశింపబడిన ఆయాపరమేశ్వరాంశమును అవలంబముగా చేసికొని సాధకుడు విశ్వాత్మభావనచేయవలసియున్నది. అనంతమైన పరమాత్మ విభూతిలో నియతమగు పరిగణనలేదు. ఏవిధమున గాని అదిసంఖ్యానశక్యముకాదు. నిరవలంబమైన నిష్ఠకుదురదు. కావున అనంతమైనను విభూతినిర్దేశ మొనర్పబడినది. ఏకైక

విభూతిననుసరించినను దానికంత మేమాత్రమును లేదనియే భావించునప్పుడు సాధకుడు విశ్వాత్మభావము పొందగలడు.

### 63 భక్త్యా త్వనన్యయా శక్యః 11-54

భగవానుని నిర్గుణభావముభక్తికిని అందునదికాదు. అదికేవలము జ్ఞానముచే విజ్ఞేయము, భక్తిగుణమయము. కావున అంతరంగధర్మము. కావున గుణమయమగునట్టి భగవద్రూపమే భక్తిలో భాసించును. కాగా అవ్యక్తభావము జ్ఞానగమ్యమని వ్యక్తభావము భక్తిచే తెలియతగినదని గ్రహింపవచ్చును. భగవానుని విశ్వాత్మకమైన రూపము ప్రత్యక్షము చేసికొనుటకు అసాధారణ యోగ్యతకావలయును. భగవద్దత్తమైన దివ్య చక్షువున్నకాని విశ్వరూపము గోచరముకాదు. భక్తునందు పరమేశ్వర ప్రబల విశ్వాసముదయించుటకై అద్భుతసన్నివేశము అపేక్షితము. కావున భక్తుడైన అర్జునునకు భగవానుడు విశ్వరూపమును దర్శింపచేసినాడు. విశ్వమునంతటిని గ్రసించునట్టి ఐశ్వరరూపసాక్షాత్కారము పొందుటకుకూడ అసాధారణయోగ్యత ఉండవలయును. సుదుర్దర్శమైనను ఆ పారమేశ్వర విశ్వరూపమును చూడవలయునని నిత్యము దర్శన కాంక్షులైయుందురు. కేవల వేదాధ్యయనమున అట్టిరూప సాక్షాత్కారముకలుగదు. తపముచే దానముచే యాగముచే అట్టిరూపమును చూడజాలము. అనన్యమగు భక్తియున్ననే విశ్వరూపదర్శనభాగ్యము కల్గును. భగవానుని నిత్యప్రసన్నకళతో కూడుకొనిన సౌమ్య

భావసముపేతమైన వాసుదేవరూపమును కాని అనన్యభక్తి తోడనే సాక్షాత్కరించుకొనవలయును. వ్యక్తావ్యక్తరూప మునను అందు భగవత్స్వభావము తెలుసుకొనుటకు సాక్షాత్క రింపచేసికొనుటకు అభిన్నభావముతో అందు ప్రవేశము పొందుటకును అనన్యభక్తియే సాధనము. పరమేశ్వర ప్రీతికై పరమేశ్వరకర్మలనే ఆచరించుట పరమేశ్వరునే పరమునిగా తలచుట తద్భక్తుడగుట సంగరహితుడగుట వైరభావ వర్జితుడగుట సర్వభూత సమభావనుడగుట భగద్భావమును సంపాదించుటకు తగినవిధానము. వాని యన్నిటియందును అనన్య భక్తిరేఖలు కూడుకొనియే ఉన్నవి. భక్తితో భజింప తగినవాడును భగవానుడే. ఉద్దేశింపబడువాడును భగవా నుడే. గమ్యము కావలసినవాడును భగవానుడే, అయి నప్పుడే అనన్యనిష్ఠ ఉచితమగును. అట్టి ఆ అనన్యనిష్ఠ సము త్పన్నమై నప్పుడేభగవానుని దివ్యరూప దర్శనమహాభాగ్యము కల్గును. 52వ సూత్రమందును అనన్యభక్తియొక్క విశేషమే సూచితమైనది. అదియే భంగ్యంతరముగా విధాంతరమున విశ్వరూపములోని సదుపపత్తిని ప్రాప్తిపద్ధతిని సూచించుటకై మరల ఇచట నిర్దిష్టమైనది.

## 64 అహంసముద్ధర్తా 12-7

మానవులు సామాన్యముగా మాయాతంత్రమున చిక్కు-కొనిన వారగుటచే మృత్యు సంసారసాగరమందు పరిభ్రమించువా రగుదురు. అయినప్పటికి భగవద్భజనాభిలాష వారి హృదయ

మునుండి నశింపదు. అందువలన విధాంతరముల నాశ్రయించి భగవానుని సేవింతురు. వారి సేవనమందనేకరీతు లుండును. సతత యుక్తులై సగుణ విశ్వరూపమును ధ్యానించువారు కొందరుందురు. అనిర్దేశ్యమగు అవ్యక్తమైన అక్షరోపాసన చేయువారు కొందరుందురు. సర్వకర్మలను పరమాత్మయందు సన్యసించి పరమేశ్వర పరాయణులై అనన్యయోగమున ధ్యానించునట్టి భక్తులను సంసార సాగరమునుండి భగవానుడే సముద్ధరించును. భగవానునియందు ఆవిష్టచేతసులైనచో శీఘ్రముననేభగవానుడు ప్రసన్నుడగును. కల్యాణకారియగువాడు దుర్గతినిపొందడు అని ఇదివరలో చెప్పబడినది. భక్తునియొక్క యోగక్షేమములను తానేవహింతునని భగవాను డను చున్నాడు. భగవానుడు తనయంతట తానే సముద్ధరించును కదా అని విశృంఖలముగా పాపవృత్తుల నాచరింపరాదు. అనన్యవిధానముతో నిధ్యానముచేయుట ఆవశ్యకమని సూచితమౌచున్నది.

## 65. మత్కర్మపరమోభవ 12–10

భగవానునియందు మనస్సును సన్నిధాపితము చేయవలయును. బుద్ధిని వికసింపచేయవలయును. అట్టివాడు తన భౌతికశరీరమందు సర్వభావమును పరమేశ్వరునికై సమర్పితముచేసినచో జీవనమునంతను తద్విధానములకై యాపనముచేసినచో జీవితాంతమున భగవన్నివాసముకల్గును. అవ్యక్తమును ఉపాసించుట ముఖ్యపద్ధతి. అందుల కందరును సమర్థులు కాజా

లరు. అక్షరము నారాధించుట వేరొకపద్ధతి. అందును అందరు సమర్థులుకారు. భగవానునియందు మనస్సును నియమితము చేయుట వేరొకప్రణాళిక. అందును కొందరే సమర్థులు. అభ్యాసయోగమున భగవానునిపొందుటకై ఇచ్ఛకలవాడగుటయు ఉచితమగుమార్గము. అందులకును కొందరకు సామర్థ్యముండదు. అట్టియాతడు భగవంతునికొరకగు కర్మయందు పరాయణుడు కావలయును. కర్మాచరణవిధానము ప్రమాదములేనిది. అర్హతనుసంపాదించునది. భగవత్ప్రీతిని సంపాదించునది. చిత్తకాలుష్యము పోగొట్టునది అని మహనీయులు చెప్పుచున్నారు. అన్నిటికిని పునాదిగానుండునది కర్మకరణము. అదియే లోకసంగ్రహమును సంపాదించును. భగవదర్థమై కర్మలనాచరించుచో సిద్ధికల్గును. అంతకును సామర్థ్యముండదేని భగవద్యోగము నాశ్రయించి నియతాత్ములై సర్వకర్మ ఫలత్యాగమొనరించుట ఉచితమైయున్నది. లోకతంత్రమంతయు కర్మచే నిర్వహింపబడుచున్నది. ఐశ్వరకర్మ హేతువుగా సృష్టి ఉత్పన్నమైనది. జీవకర్మలు కారణముగా ప్రపంచవిలాసము ప్రసరించుచున్నది. కర్మవిధానము తెలిసి భగవదాప్తికై కర్మారంభము చేయుట ఉచితమైయున్నది.

## 66 జ్ఞానాత్ ధ్యానంవిశిష్యతే 12-12

మానవుడు తన సామర్థ్యమును బట్టి పరమేశ్వరచింతన మొనరింపవలయును. తన అర్హతకుమించిన విధానము అసహనము శీఘ్రత ఉండుట ఫలమును పొందుటలో సముచితములుగా

ఎన్నబడుటలేదు. ఎట్టి విధానమున నైన మానవునకు స్వసంస్కారమే ప్రధానము. అందుచేత నేయేవిధానములు సుయోగ్య పద్ధతిలో సంస్కారకములు కాగల్గునో ఆపద్ధతిలో వానివానిని సేవించుట సముచితమై యున్నది. ఎవనిదృష్టిలో వాని ఆచరణము ప్రధానముకావలయును. అవ్యక్తగతిని ఉపాసించుట క్లేశజనకమగునని చెప్పబడుచున్నది. అట్లే జ్ఞాననిష్ఠ కూడ క్లేశబహుళము కావచ్చును. అట్టియెడ అవిశేషముగా మానవులు ప్రవర్తింపజాలరు. భగన్నిష్ఠను సంపాదించుటకు మానవులలో యేది సులభవిధానముగా నుండునో సౌలభ్యము సంపాదించునది అగునో సర్వజనసమాదరణీయమగుచుండునో ఆవిధానమునుబట్టి చూచినచో అట్టిదానియందు విశేషమున్నదని స్వీకరింపవలయును. జ్ఞానము మనఃకార్యముకాదు. మనస్సును విడచి మానవులు ప్రవర్తింపజాలరు. అందుల కందరకు సామర్థ్యముండదు. ఏకొందరకో గల సామర్థ్యము సర్వసులభము కాజాలదు. సర్వసౌలభ్యముకల విధానమందు విశేషమున్నదని అంగీకరించుట సముచితముగా నుండును. నానావిధాభ్యాసపద్ధతి ననుసరించి భగవచ్చింతన మొనర్చుటకన్న భగవత్స్వరూప జ్ఞానము కల్గిఉండుట ఉత్తమముగా తలచబడుచున్నది. అందువలన అభ్యాసముకన్న జ్ఞానము త్తమము. కేవలమట్టి స్వరూప విజ్ఞానమేకాక ఆ స్వరూపమును అంతరవగతముచేసికొనుచు ధ్యానించుట విశిష్టమైయున్నది. కావున జ్ఞానముకన్న ధ్యానము విశేషముకలదియని అంగీకరించుట సమంజసముగానున్నది.

## 67. తే అతీవమే ప్రియాః 12-19

పరమేశ్వరప్రోక్తవిధానములననుసరించి ప్రవర్తించునట్టి మానవుడు ప్రపంచమందు భూతకోటిని ద్వేషింపడు-మైత్ర కరుణ భావములుకలిగి సుఖదుఃఖ సమానుడై నిర్మమాహంకారుడై ఓర్పుకలిగి ప్రవర్తించును. స్వార్థపరత్వముకాని ఆశాహతత్వముకాని ఆతనికుండదు. దృఢనిశ్చయుడై పరమేశ్వరునందు మనోబుద్ధులనర్పించి భగవద్భక్తుడైన మానవుడు భగవానునకు ఇష్టుడగును. లోకమునకు ద్వేషము కలుగచేయక లోకమువలన తానుద్వేగపడక హర్షామర్ష భయోద్వేగరహితుడైన వానిని భగవానుడభిమానించును. పవిత్రభావముకలిగి అపేక్షారహితుడై దక్షత్వముకలిగియు ఉదాసీనుడై వ్యథలేక ఉండువానిని భగవానుడభిమానించును. హర్షద్వేష శోకకాంక్షలులేక శుభాశుభముల పరిత్యజించి భక్తుడైనవానిని భగవానుడభిమానించును. శత్రుమిత్రులందు మానావమానములందు శీతోష్ణ సుఖదుఃఖములందు నిందాస్తుతులయందు సమవృత్తియై ప్రవర్తించుమానవులు భగవానునకు ప్రేమపాత్రులు. శ్రద్ధధానులై భగవత్పరములై ధర్మ్యామృతమును ఉపాసించునట్టివారు భగవానునకత్యంతము ప్రియులు. ఉత్తమకృత్యము నాచరించువారిని అందరును హర్షింతురు. భగవత్ప్రేమ వహించుటకన్న ఉత్తమప్రేమ లేదు. ప్రసన్నభావముతో కూడుకొనిన భగవదనుగ్రహము కల్గినచో ఇంక నపేక్షింపవలసినదిలేదు. అప్పుడాత్మసంసిద్ధి సులభమగును. భక్తుని భగవానుడనుగ్రహింపదలచుట లోక

మునకు శ్రేయము. భగవానుని ప్రేమపొందుటకు మానవులు సర్వదా ప్రయత్నింపవలయును.

## 68. ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే 13–18

దీనిని తెలియువాడు పరమాత్మభావమునుపొందును. ఇది వరలో పరా పర ప్రకృతులుగా చెప్పబడిన స్వరూపము క్షేత్ర క్షేత్రజ్ఞరూపముగా ఇచట నిర్దేశింపబడుచున్నది. బాహిర ముగా కన్పడునట్టి ఈ దేహామంతయు క్షేత్రమనబడును. ఆ క్షేత్రస్వరూపమును తెలియువాడు క్షేత్రజ్ఞుడు. క్షేత్రము లనంతములు. క్షేత్రజ్ఞుడొకడే. ఆతడే శ్రీకృష్ణపరమాత్మ. క్షేత్ర క్షేత్రజ్ఞములకు సంబంధించిన జ్ఞానము పరమేశ్వర జ్ఞానము. క్షేత్రము వికారసహితమైయుండును. పంచభూత ములు అహంకారము అవ్యక్తము జ్ఞానేంద్రియ కర్మేంద్రియ ములు మనస్సు శబ్దాది విషయ పంచకములు, ఇచ్ఛాద్వేష సుఖదుఃఖములు పంచభూతపరిణామమగుచేతన ధృతి ఇవన్నియు కలసి క్షేత్రమనబడుచున్నవి. ఇదియంతయు నానా వికారము కలిగియుండును. ఐహిక ప్రపంచమందభిలాషలేక పరాత్మనిష్ఠ కలిగి అవ్యభిచారిణియగు భక్తినిపొంది ఆత్మవికాసము కొరకై ప్రయత్నించువానికి జ్ఞానముదయించును. జ్ఞానముద్రవికసింపగా విస్పష్టముగా జ్ఞేయము భాసించును. అనిర్వచనీయమగునట్టి సచ్చిదానంద ఘనమైన బ్రహ్మ, జ్ఞేయమగుతత్త్వము నవభాసింప చేసికొన సమర్థులగువారికి అంతటను అవభాసించును. బహి ర్బుద్ధులకు అది దూరస్థము. అంతర్ముఖులకు అది సన్నిహితము.

అవిభక్తమైనను విభక్తమైనట్లుగా భాసించును. విశ్వాధార స్తంభమై సూర్యచంద్రాదులకును జ్యోతిః ప్రదమై సర్వ ప్రవర్తకమై తమస్సునకతీతమైయున్న ఆత్మ తత్త్వమే జ్ఞేయము. క్షేత్ర క్షేత్రజ్ఞరూపములను జ్ఞానరూపమున స్పష్టముగా దెలిసి ప్రవర్తించుట ఆత్మభావమును సంపాదించును. సర్వప్రపంచమునందు ఆత్మతత్త్వమనుగతమైయున్నను ప్రపంచముకన్న అతిరిక్తముగా ప్రపంచ సంబంధము లేనిదానినిగా ఆత్మను తెలియవలయును. అట్లు తెలియుటలో జ్ఞానముపకరించును. ఇవియన్నియు కూడ భగద్భావమున గ్రహించి అనుకూలము చేసుకొనవలయును. క్షేత్రక్షేత్రజ్ఞులు అనిచెప్పబడునవియే ప్రకృతిపురుషులుగా నున్నవి. ఈ రెండును అనాద్యులు. పురుష స్వభావమునుండి ప్రకృతి ఎట్లు విభక్తమైనదో చెప్పజాలము. అందువలన అనాదియని చెప్ప వలసియున్నది. వికారములు గుణములును ప్రకృతిసంభవములు ఇవియేవియు ఆత్మవికారాపు. ఇట్టివిషయవివేకమును అనుభవ పథమందు అవరూఢముచేసి గ్రహించువారు ఆత్మవిజ్ఞానమును బడయగలరు.

## 69. యః పశ్యతి స పశ్యతి 13–27

ప్రాపంచికదృష్టి దృష్టికాదు. ఆత్మదృష్టియే దృష్టి. మానవుడు తనకుగల విజ్ఞానమును ఆత్మోపలబ్ధికి సాధనముగా జేసికొన్నప్పుడే విజ్ఞానముకలవాడనబడును. ఆవిజ్ఞానమునకు ఆ వ్యాపారమునకును సార్థకతకల్గును. ప్రకృతిస్థుడైన పురుషుడు గుణానుబంధము పొందుచున్నాడు. కేవల చేతనమైన ఆతని

స్వభావములో గుణవిధాన మేమియు లేదు. చేతనుడైన ఆత్మ సదసజ్జన్మలను పొందుచు నానాపరిస్థితి నుండుటలో గుణ సంగమే కారణము. ఆత్మగానున్న పరమాత్మను ధ్యానవిధాన మున కొంద రవలోకింతురు. సాంఖ్యపద్ధతిలో కర్మపద్ధతిలో తెలిసికొనజూచువారున్నారు. కొందరావిధమున గ్రహింప జాలక ఇతరులనుండి ఉపదేశముగా గ్రహించి హృదయఫలక మందు నిక్షేపించుకొని ఉపాసించువారు కలరు. స్థావరజంగ మాత్మకమైన విశ్వము క్షేత్రక్షేత్రజ్ఞుల సంయోగమువలన ఉత్పన్నమగుచున్నది. ఆయా భౌతికపదార్థములన్నియు వినా శము పొందుచున్నప్పటికి ఆత్మ వస్తువునకు నాశములేదు. ఇట్లు పరిశీలింపగల్గిన మానవుడే పరిశీలకుడనబడుచున్నాడు. అంతటను సమదృష్టితో ఆత్మను భావించునప్పుడు హింసింప తగినది తన కొండుకన్పడదు. భూతపృథగ్భావమునంతను ఏకస్థముగా పరిశీలించుటయందే సమ్యగ్దర్శిత్వమున్నది. ఆత్మ దర్శనమే దర్శనము. అదియే అభ్యసనీయము. ఆత్మదృష్టి ఉన్నప్పుడే దృష్టికలవాడనబడుచున్నాడు. జ్ఞానచక్షువుతో ఇట్లు పరిశీలింపకలిగినప్పుడు పరప్రాప్తికలుగును.

## 70. మమయోనిర్మహద్బ్రహ్మ 14-3

మహాప్రకృతియంతయు బ్రహ్మగా చెప్పబడుచున్నది. బృంహణ స్వభావముకలది కావున ఆపేరు అచట సముచితము కావ చ్చును. అది మహారూపముకలది. చిత్రవిచిత్రత దానియం దున్నది. సర్వప్రాణికోటికిని అది ఉత్పత్తిస్థానము. సర్వ

భూతములును అదియే హేతువుగా సముత్పన్నములగుచున్నవి. అది జడమైనను ఆధారమైయున్నది. పరమేశ్వరుడు ఆ ప్రకృతి యందు గర్భమును ఆధానించుచున్నాడు. ఆయాయోను లందు సముత్పన్నములగు సర్వమూర్తులకు బ్రహ్మగా చెప్ప తగిన మహాయోనియగు ఆప్రకృతియే సర్వకారణము. సృష్టి తత్వమందు ప్రకృతివిలాసమే ముందుగా తెలియబడుచున్నది. దానియందే మానవులు విలసించుచున్నారు. అంతకతీతముగా ఆత్మతత్వమున్నదని తెలియవలసియున్నది. అందుకొరకై వివేకముతో ప్రకృతి స్వభావమును బ్రహ్మ స్వభావ మును తెలియవలయును. ప్రకృతియొకట్టే సర్వకారణమని తలచునట్టి వైజ్ఞానికుల వాదమిచ్చట పరాస్తమగుచున్నది. ప్రకృతికన్న అతిరిక్తముగా ప్రకృతిని తరింపచేయునట్టి పర మాత్మ కలడని ఇచ్చటి సిద్ధాంతము.

## 71 అహంబీజప్రదఃపితా 14-4

పరమాత్మ సర్వకారణము లోకమందు శిశూత్పత్తికి తల్లియు తండ్రియునుండుట అవసరమైయున్నది. తండ్రి బీజప్రదాత. తల్లి గర్భమున ధరించి శిశువును కనుచున్నది. అట్లే ప్రకృతిమాత. భగవానుడు తండ్రి. ఆతడు బీజప్రదాత. సర్వద్రష్ట సర్వాను మంతయు ఆతడే. సహజచేతనమైన భగద్భావమువలననే సృష్టి చక్రము ప్రవర్తించుచున్నది. కేవలజడమైన ప్రకృతి పరమాత్మ సన్నిధానముననే చలింపగల్గుచున్నది.

## 72 గుణాః ప్రకృతిసంభవాః 14-5

సత్వరజస్తమోగుణములు లోకమున ప్రసిద్ధములు. అవి యన్నియు ప్రకృతివలన ఉత్పన్నములగుచున్నది. సత్వరజస్తమోగుణములయొక్క సామ్యావస్థయే ప్రకృతి. అప్పుడు అచట ఒక్కొక్క గుణమునకు ప్రాధాన్యముకాని న్యూనత్వము కాని లేదు. వానికి ఆసమయమందు విభాజకధర్మమేదియు లేదు. పరమాత్మసన్నిధానమున అది ఎట్లో స్పందించును. ఆస్పందమునకు హేతువు స్పష్టముగా చెప్పుటకు శక్యముకాదు. అది అనిర్వచనీయభావము. ఆ ఆద్యస్పందము హేతువుగా అనేకస్పందములు కల్గును. అట్టి స్పందవిధానములో సత్వరజస్తమోగుణములందు తరతమ భావమేర్పడుచున్నది. అప్పుడు ప్రత్యేక విభాగము ఉదయించు చున్నది. పరస్పర సంకీర్ణతయు కల్గుచున్నది. భేద ప్రభేదా వాంతర భేదములనుకూడ అవి పొందుచున్నవి. వాని అనంతమైన పరస్పర సంబంధములో విశ్వవిశ్వమంతయు ఉదితమగుచున్నది. సత్వమునిర్మలము. అది ప్రకాశము. దాని సంబంధమున మానవుడు సుఖజ్ఞానముల పొందును. రజోగుణము రాగాత్మకము. దానిచే జనుడు తృష్ణాకర్మాసక్తుడగును. తమస్సు జ్ఞానజన్యము. అది సర్వమోహనమైయున్నది. ప్రమాదాలస్య నిద్రాదులు తదనుసర్తకు కల్గును. గుణవిలాసము ననుసరించిన విశేషములు ఇంకను అనేకములుగా కల్గును. దేహమునందు సర్వద్వారములను లాఘవము వికాసము అనుభూత మగు నప్పుడు జ్ఞానమతిశయించునప్పుడు సత్వము అభివృద్ధ మగుచున్న దని గ్రహింపవలయును. సత్వగుణము అభివృద్ధిలో నున్నప్పుడు

దేహమును పరిత్యజించినచో ఉత్తమ తత్త్వవేత్తల అనుల లోక ములు సంపన్నము లగును.

### 73 సత్త్వాత్ సంజాయతేజ్ఞానమ్ 14-17

సత్త్వగుణమువలన జ్ఞానము జనించును. జ్ఞానము సహజస్వ భావము. రజస్తమోవృత్తులు దాని నావరించి యున్నవి. అందుచే అజ్ఞాన ప్రకాశము బహిఃప్రపంచమందు స్ఫుట రూపము పొందుటలేదు. సత్త్వమతిశయించినదనగా రజస్తమో వృత్తులు ప్రక్షీణములైనవని తలచవలయును. అవి నశించి నప్పుడు దుఃఖ మోహావరణ ఉండదు. శుద్ధసాత్త్వికమగు అవ భాసయే ఉండును. అట్టి సాత్త్వికమైన అంతరంగములో జ్ఞాన మవభాసించును. జ్ఞానమునకు ప్రకాశయున్నదని అవభాసము న్నదని సాత్త్విక సాత్త్వికమైన అంతరంగావస్థయందే గ్రహింప గలము. సత్త్వగుణ ప్రవిలాపమందు జ్ఞానప్రకాశాదులు ఎట్టి వో తెలియ బడజాలవు. సత్యమందు జ్ఞానశోభ అవభాసించు చున్నది. కాబట్టి జ్ఞానము సత్త్వమువలన సంజాతమగుచున్నదని చెప్పుట యుక్తముకాకపోదు.

### 74. ఊర్ధ్వంగచ్ఛంతి సత్త్వస్థాః 14-8

సత్త్వనిష్ఠితులై తమ జీవయాత్రను ప్రసరింపచేసిన మానవులు ఊర్ధ్వలోకములను పొందురు. రాజసులకు మధ్యస్థితియే నియతము. తామసులు అధోగతులగుదురు. సత్త్వనిష్ఠ అధిక ముగానున్న సమయమున ఆనందావరణము తొలగిపోవును.

ఆవరణములు తొలగుచుండగా బంధములన్నియు విడిపడి పోవును. బంధనరహితుడైనప్పుడు ఆత్మీయస్వేచ్ఛాసంచారియై సహజభావమును పొందుట కర్హుడగును. తనకు సంబంధించి ఉన్న లోకము సాత్విక రాజసతామసాదిభావ వ్యూహముతో కూడుకొని ఉన్నట్లు విశదము. ఇంతకన్న ఊర్ధ్వలోకములందు ఉత్తమ స్థానములందు క్షుద్రగుణసంబంధముండకపోవచ్చును. ఎచట మోహమయరాగమయ విపరీతభావము లుండవో ఆస్థానమందు సాత్వికులు అవకాశమును పొందగలరు.

## 75. గుణాతీతస్సఉచ్యతే 14—25

అట్టియాతడే గుణాతీతుడనదగును. లోక ప్రవృత్తి కలాప మంతయు గుణకృతమైయున్నది. లోకమందలి కర్తృత్వాది ధర్మములన్నియు గుణములకన్న అతిరిక్తమగువానిచే ఒనరింప బడుటలేదు. అని నిశ్చితముగా గ్రహించినప్పుడు పరమేశ్వర భావము గుణాతిరిక్తమని గుణపరమని సాధకుడు తెలిసికొన గలడు. అప్పుడు గుణాతీతమైన ఆత్మభావమును పొందును. దేహమందు సముత్పన్నములగునట్టి ఈ మూడుగుణములను అతిక్రమించి జన్మమృత్యు జరాదుఃఖవిముక్తుడై అమృతత్వ మును పొందును. గుణాతీతస్వభావమును పొందుటకు అనేక విధానములున్నవి. అంతటను అన్నిటను ఔదాసీన్యము వహించుట అపేక్షితము. సంప్రవృత్తద్వేషముకాని నివృత్త కాంక్షకాని లేక ప్రకాశప్రవృత్తిచే మోహమును వైకొనక ఉన్నచో గుణములు చలింపచేయజాలవు. గుణకృత్యములు

గుణకృత్యములే. ఇవి ఆత్మసంబద్ధములుకావు. అని నిశ్చిత బుద్ధితో గ్రహించినప్పుడు ఏమాత్రమును కంపింపడు. గుణ మయమగు సృష్టిని క్రమక్రమముగా విలాప మొనర్చుటను అభ్యాసవశమున తెలిసికొనినచో గుణాతీతభావము సిద్ధ మగును. గుణాతీతుడు స్థితప్రజ్ఞుడగుచున్నాడు. స్వరూప శోభతో నుండునదీతడే.

## 76. పచామ్యన్నం చతుర్విధం 15-14

ప్రాణుల దేహము నాశ్రయించి పరమేశ్వరుడు అన్నవిభాగ మొనర్చుచున్నాడు. ప్రాణిమాత్రము యొక్క శరీరమందు నాభి కందమున జఠరములో అగ్నిగా పరమాత్మ కలడు. రాత్రిం దినములు చలించునట్టి ప్రాణాపానవాయువులయొక్క గతి విశేషమందు అన్నపచనము జరుగుచున్నది. ప్రాణాపానసమా యుక్తుడై భాసించునది పరమేశ్వరుడే. భుజింపబడిన అన్నమును నాల్గువిధములుగా పచనముచేయునదాతడే. కాగా జీవులం దంతటను పరమేశ్వరుడేకలడు. జీవులను కల జీవనమును భగ వానుడే. జీవనచాలనముచేయు జఠరాగ్నియు భగవానుడే. వ్యాపకత్వమును వహించిఉన్న పరమేశ్వరునికన్న అతిరిక్త ముగా విశ్వమందేమియు లేదు. వాస్తవదృష్టిలో భగవానుని కన్న అతిరిక్తముగా భిన్నముగా ఏవస్తువును లేదు. అయినప్ప టికి ప్రాణికల్పనలో భగవానుడు బుధ్యనుసారముగా భాసిం చును. ఆకాశగుణమగు శబ్దమొకటియే. వాద్యభేదములను బట్టి భిన్నమగుచున్నది. కాగా జీవరూపమందు భగవానుని

స్వరూపము భాసించుచున్నది. బుద్ధిమంతులగువారు వాస్తవిక స్వరూపము ఆనందదాయకమని గ్రహింపగలరు. అందువలననే భగవానుడు మహావ్యాపియైయున్నప్పటికి ఒక్కొక్కచో అప్రకాశరూపమున ఉండుట అనుభవమందున్నది. మానవుని బుద్ధివృత్తులకందనట్టి ప్రదేశములందును ఆత్మసత్తఉన్నది. ఊహాలోభాసించు ఊర్ధ్వలోకమునకూడ సత్తనుకలుగచేయునది ఆత్మరూపమే. ఆలోచింపగా అవగాహింపబడు అధోలోకమునందును వ్యాపించి ఆ ఆత్మప్రకాశమేకలదు. అటునిటు ఆపరమాత్మయుండుటయేకాదు. జీవభావముపొంది అంతట నవభాసించునదియు ఆ పరబ్రహ్మమూర్తియే.

## 77. వేదాన్తకృత్ వేదవిదేవచాహం 15-15

సర్వప్రాణుల హృదయమందు భగవానుడు సన్నివిష్టుడైయున్నాడు. భగవానుని సత్తవలననే స్మృతిగాని జ్ఞానముకాని అపోహనముకాని కలుగుచున్నది. వేదపదము జ్ఞానమునుచెప్పును. జ్ఞానముచే తెలియతగినది పరమాత్మరూపమే కావున వేదవేద్యుడు భగవానుడుఅనినిశ్చితము. జ్ఞేయమగునట్టిపరమాత్మస్వభావము పొంది జ్ఞానము జ్ఞానాకారమును విడిచిపెట్టుచున్నది. జ్ఞానమునకు పరమాత్మయందే నిర్ణయము కన్పడుచున్నది. అందుచే వేదాన్త కర్తయగువాడు పరమాత్మయే. వేదముజ్ఞానరాశి. జ్ఞానము జ్ఞేయమగునట్టి పరమాత్మరూపము జ్ఞానముయొక్క స్వభావము తెలియునదియు పరమాత్మయే. వేదమక్షర స్వభావము. అకారమాదిగా హకారమంతముగా అక్షరములు కూర్చు

పొందుచున్నవి. అక్షరతత్వమున కతీతమైన నాదాంశము పర మాత్మ స్వరూపము. నాదమునుండి ప్రణవముద్భవించినది. ప్రణవమునుండి వేదములు వెలువడినవి. కావున భగవానుడు సర్వవేదాత్మకుడు. అతడే వేదవేత్త. వేదము అహాత్మకము. కావున పారమేశ్వరమై అవభాసించు చున్నది. ప్రపంచమునకు విజ్ఞానమును సంపాదించునది వేదమే. అందుచే విజ్ఞాన రూపత్వ మును భగవానునకు నిశ్చయించి జ్ఞానము సహాయముగా స్వరూప రహస్యము తెలియవలయునని ఆదేశము.

78 ప్రథితఃపురుషోత్తమః 15-18

లోకములందును వేదములందును పురుషోత్తముడు ప్రఖ్యా తుడై యున్నాడు. ఈ పురుషోత్తముడే పరమాత్మ. అస మ్మోహ స్వభావములో మానవుడు ప్రయత్నమొనరించి నప్పుడు పురుషోత్తమ స్వభావము తెలియగలడు. పురుషోత్తమ విజ్ఞానమున్నప్పుడు సర్వజ్ఞత్వము కల్గును. ఆ సమయమున సర్వ భావము వికసించును. అప్పుడు పురుషోత్తముడనబడు భగ వానుని మానవుడు సర్వవిధముల భజింపగలడు. పురుషోత్తమ స్వభావము సూక్ష్మ విజ్ఞేయమై యున్నది. సర్వాతీతమగు పురుషోత్తమ భావమును తెలియుటయే బుద్ధిమత్త. అదియే కృతకృత్యత. మానవు డాతత్వమును తెలియుటకు విభాగ దృష్టిని అవలంబింప వలయును. ప్రపంచమందున్న మానవు లకు ప్రపంచ విలాసమే గోచరించును. ఈ తత్వమునంతను జడ ముగా చేతనముగా విభాగము చేయవలయును. జడమగున

దంతయు క్షరభావము. ఆజడము అక్షరము. క్షరభావముతో సంబంధించి అక్షరభావముండును. క్షరభావమే ప్రకృతి. ప్రకృతిసంబంధములేక కేవల చేతనభావములోనున్నప్పుడు పరమాత్మ యనబడుచున్నాడు. ఆతడే ఉత్తమపురుషుడు. పురుషోత్తమభావమిదియే. ఆ ఈశ్వరుడు లోకత్రయము నావేశించి విశ్వమును భరించుచున్నాడు. జడభారము నంతను వదలి జడప్రతిబింబితమగు చేతనభావము తెలిసి అనంతరము శుద్ధచైతన్యమును తెలియుటయే కృతకృత్యత్వము. ఆవిశుద్ధ చేతనభావ రహస్యమును గుహ్యతమమగు శాస్త్రము.

## 79. దైవీసంపద్విమోక్షాయ 16—5

పురుషోత్తమభావము తెలియుటకు అర్హతకావలయును. రెండు విధములైన సంప్రదాయములు లోకమునం దనుగతములు కావలయును. ఒకటి దైవీసంపద. రెండవది ఆసురీసంపద. దైవీసంపద విమోక్షమును సంపాదించును. అవిద్యను నశింపచేయును. అజ్ఞానమును తొలగచేయును. బంధమును పోగొట్టును. వివేకమును విభజింపచేయును. విభాగదృష్టిని సంపాదించును. క్షరాక్షరభావమును అవగతముచేయును. నిత్య చేతనభావమును ఆకళింపచేయును. పురుషోత్తమభావమును అనుభవింపచేయును. అట్టి దైవీసంపదను సంపాదించుటకు అనేకవిధములైన ఉత్తమగుణములు అపేక్షితములైయున్నవి. సత్సంప్రదాయమున జన్మించి ఉత్తమవిధానముల అవలంబించి వేదాది విద్యానిరతిగలిగి శమదమాదులపొంది బ్రహ్మచర్యనిష్ఠ

కలిగి కామక్రోధాధులవిడచి జ్ఞానయోగవ్యవస్థితిని పొందినప్పు డు సత్త్వసంశుద్ధిని సంపాదించినప్పుడు అభయభావమును పొందిన పుడు శాంతిదాంత్యాదుల నవలంబించినపుడు ఇంద్రియ నిగ్ర హము సంపాదించినప్పుడు దైవసంపదకు ఆనుకూల్యము కన్పడును. అంతరంగమందు భిన్నభావ వ్యూహముండవచ్చును. వానియందు అనుకూలభావములనే నిషేవించుచు విరుద్ధభావ ములను నశింపచేసికొనుట ఆవశ్యకమైయున్నది. ఆసుర సంపద బంధహేతువు. అవిద్యాకారణము. అజ్ఞానకందము. జ్ఞానవిరోధి విముక్తి ప్రతిబంధము వికాశ వినాశము. శౌచ ముండదు. ఆచారముండదు. సత్యముండదు. ఆసురసంపద కలవారు, ఈశ్వరుడు లేడందురు. జడమంతయు స్వతంత్ర మందురు. ప్రపంచమంతయు కామహేతుకమందురు. స్త్రీ పురుషుల సంయోగమే ప్రధానమందురు. వారు నష్టాత్ములు. వారల్పబుద్ధులు. వారుగ్రకర్ములు. వారు జగన్నాశకులు. ప్రపంచహితమును సంపాదింపలేరు. కామమును నిగ్రహింప లేరు. దంభమానముల పోగొట్టలేరు. మోహమును విడువలేరు. ప్రళయాంతచింతావ్యాకులత్వముతో కామోపభోగపరాయ ణత్వముతో ఆశాపాశబద్ధులై కామక్రోధపరులై ప్రవర్తింతురు. అన్యాయమున ద్రవ్యము నార్జింతురు. అహంకరింతురు. ఈశ్వ రుడనని, సిద్ధుడనని, బలవంతుడనని, అజ్ఞానవిమోహితులై మోహజాలసమావృతులై కామభోగములందే ప్రసరింతురు. ఆధనమానమదాన్వితులకు నరకపాతమున్నది. అవిధిపూర్వక ముగా నామయజ్ఞములను వారాచరింతురు. భగవానుని

ద్వేషింతురు. ఆమూఢులు పరమేశ్వరుని పొందజాలరు. అధమ గతిని పొందుదురు. కాబట్టి ఆసురసంపద నిబంధమును సంపాదించునదైయున్నది. అందుచే ప్రాజ్ఞులైనవారు దైవీసంపదను స్వీకరించి ఆసురమును విడనాడి విముక్తి సాధనములను అవలంబింపవలయును.

## 80 తస్మాత్ శాస్త్రంప్రమాణం 16-24

శాసించునది శాస్త్రము. శాస్త్రము తత్వనిర్ణయమొనరించి కర్తవ్యము నుపదేశించును. విముక్తికికాని, తత్సాధనములకు కాని, దైవీసంపదకుకాని, ఆసుర విమోచనమునకుకాని మానవునకు కర్మ కరణమపేక్షితమై యున్నది. కర్మపద్ధతి బుద్ధి వృత్తులందు అనేకవిధముల భాసింపవచ్చును. క్షణ క్షణమునకు భాసించునట్టి ఆ వృత్తులన్నియు నియతములు కాజాలవు. ఆర్ష దృష్టి కలిగిన మహనీయుల విధానమందు నియతపద్ధతి గోచరించును. బుద్ధివృత్తుల తారతమ్యమునుబట్టి అవియు అనియతములు కావచ్చును. అందుచే పరమేశ్వర నిశ్వాసరూపమైన వేదముల వాదములను బోధించునట్టి విధానములే ప్రమాణముగా స్వీకరింప తగియున్నవి. సామాన్య ప్రభావములో కర్తవ్యా కర్తవ్యములు సరిగా భాసింపక పోవచ్చును. కార్యాకార్యములు స్ఫుటముగ గోచరము కాకపోవచ్చును. అట్టి సమయమున శాస్త్రమే నిర్ణాయకము. ఆత్మికమైనట్టి విధాన సంపదయే మానవునకు కర్తవ్యముగ శాస్త్రచోదితమగుచున్నది. అట్టి విధానములను సూచించుటకు శాస్త్రమే

సమర్థము. సమరసభావముతో పరిశీలించినచో శాస్త్రీయాంశ మందు వైరుధ్యముగోచరింపదు. అవిరుద్ధభావముతో శాస్త్ర ములను సమన్వయించికొని తదనుశిష్టమైన పరమార్థమును ఎరిగి కార్యాకార్య విధానములను తెలియవలయును.

## 81 యోయచ్ఛ్రద్ధః సఏవసః 17-3

శాస్త్రవిధుల పరిత్యాగము సముచితముకాదు. శాస్త్రవిధి పరిత్యాగమున శ్రద్ధఉన్నప్పటికి సముచితమని చెప్పబడదు. శ్రద్ధానుగుణమైన సిద్ధి మానవులకు కల్గును. శ్రద్ధ సామాన్య ముగా త్రివిధము. స్వభావసిద్ధముగా అది అట్లు కల్గుచున్నది. మానవస్వభావము త్రిగుణాత్మకమైయుండును. గుణవిధానము ననుసరించి శ్రద్ధయు త్రివిధమగుచున్నది. సాత్వికరాజసతామస శ్రద్ధ కన్పడుచున్నది. ఒకొ్కకనికి ఒకొ్కక శ్రద్ధ ఉత్పన్నము కావచ్చును. ఆయాభావములు సముత్పన్నములగుటకు అను కూలమైన హేతుసామగ్రి పూర్వరంగముగా నుండును. ఆ పూర్వరంగముగానుండు పరిస్థితి శ్రద్ధా రూపమున చెప్ప బడుచున్నది. అదియే తదుత్తరవిధానములందు సంక్రమించగా కార్యాకార్యములందు సత్వానురూపమగు శ్రద్ధ ఉదయించును. శ్రద్ధానుకూలముగా సిద్ధి ఉండును. పూర్వసంస్కారాను సారముగా శ్రద్ధ ఉదయించును. ఆ శ్రద్ధానుసారముగనే మాన వుడు ప్రవర్తించును. ప్రకృత్యనుకూలముగనే సిద్ధిని పొందువా డగును. జీవసంఘమునకు నిర్దోషమగు శ్రద్ధ ఎన్నడును ఉదయిం పదు. ఎల్లప్పుడు శ్రద్ధ సత్వరజస్తమో గుణములచే లిప్తమైయుం

డును. స్వభావముగా శ్రద్ధఅనునది తత్వము. అది గుణత్రయ ముచే సంబద్ధముకాగా రాజసతామససాత్త్విక భేదమును పొందుచున్నది. ఘనఘోరతమోగుణముతో కూడుకొనిన మానవునకు తామసమైన శ్రద్ధయేయుండును. తదనుకూల ముగా ప్రవర్తించును. అట్లే రాజససాత్త్వికములందును తెలియ వలసియున్నది. ఈవిధమున సర్వజగత్తును శ్రద్ధాయుతమై యున్నది. పుష్పములచూచి వృక్షములను తెలియునట్లు వృత్తు లనుచూచి మనస్సులను తెలియునట్లు బాహ్యచిహ్నలనుబట్టి శ్రద్ధాత్రైవిధ్యమును తెలియవచ్చును. ఎట్టి శ్రద్ధకలవాడైనను శాస్త్రవిధానానుసరణమున ఉత్తమవిధానము నవలంబించుట కవకాశమున్నది. అందువలననే అన్నిసమయములందును శాస్త్రప్రమాణమును అంగీకరింపవలసియుండుట అపేక్షితమై యున్నది. సత్య శ్రద్ధతోనున్నప్పుడు శాస్త్ర ప్రమాణానుసర ణము అత్యంతము శ్రేయఃప్రదము. కావున సాత్త్వికశ్రద్ధనే అలవరచుకొని శాస్త్రప్రమాణాను శిష్టములైన విశేషముల నవలంబించు టావశ్యకమైయున్నది.

## 82. యజంతే సాత్త్వికా దేవాన్ 17-4

శారీరకవిధానము సాత్త్వికశ్రద్ధతో కూడుకొని ఉన్నప్పుడు సామాన్యముగా స్వర్గసుఖానురాగము కలుగును. తదను కూలములగు విద్యలను మానవుడు గ్రహించును. యజ్ఞాది విధానముల నవలంబించును. అంతియేకాక దేవలోకమందును ప్రవేశముపొందును. సాత్త్వికులు దేవతలను యజింతురు. సత్యా

శ్రద్ధమృదులము. అది తీక్ష్ణస్వభావమును వహింపదు. మృదుల స్వభావముకలవానినే రూక్షతీక్ష్ణము కానట్టి కోమలసంపద లనే సాత్వికులుకాంక్షింతురు. దేవతలందును సాత్వికరాజ సతామసభావములుకలవారుందురు. కేవల సాత్విక శ్రద్ధ కల వారిలోకూడ త్రైవిధ్య ముండును. సాత్వికతామసభావ మున్నప్పుడు తామసదేవతలను సాత్వికరాజసభావమున్నప్పుడు రాజసదేవతలను సాత్విక సాత్వికభావమున్నప్పుడు సాత్వికదేవ తలను యజింపవలయునని అభిలాష ఉదయించును. ఇట్లు సాత్వికులందు మూడువిధానములు కన్పడుచున్నవి. వారొన రించుచేష్టలందును కాంక్షించు ఫలములందును ఆరాధించు విశేషమందును త్రైవిధ్యము అపరిహార్యమైయుండును. ఎట్లైనను అవి క్రమక్రమమున సాత్వికసాత్వికసంపదను సాధించు టలో సన్నిహితమార్గములై యున్నవి. రాజసశ్రద్ధామూర్తులగు వారు రాక్షసులను పిశాచములను భక్తితో అభిమానింతురు. రాజసగుణములోని త్రైవిధ్యమునుబట్టి ఉపాసింపబడు యక్ష రక్షస్సులలో త్రైవిధ్యమూహింపవచ్చును. వారి సర్వవిహా రములందును త్రైవిధ్యముండును. తామసశ్రద్ధకలవారు పాపరాశులు, కఠోరనిష్ఠురమూర్తులు. ప్రేతములను భూత గణములను యజింతురు. హత్యల నాచరించి సంధ్యా సమయమందు ఘృణితశ్మశానములో సంచరించునట్టి భూత ప్రేత మండలములను వారు పూజింతురు. ఆ భూత ప్రేత ములు జీవసంబద్ధమైన తమోగుణ రసముచే నిర్మాణింప బడి నట్లు తెలియవలయును. తామస సాత్వికము తామస రాజ

సము తామస తామసము అను త్రైవిధ్యమును బట్టి ప్రేత భూతములందును త్రైవిధ్యమును ఊహ చేయవచ్చును. సర్వ విధానములందును త్రైవిధ్యము తప్పదు. ఈ త్రివిధము లగు చిహ్నలతో సంసారమందు శ్రద్ధ కన్పడుచున్నది. సాత్త్విక శ్రద్ధను చక్కగా సంరక్షణ చేయవలయును. అట్లు సంరక్షిత మైన ఆ శ్రద్ధయే తనకు సంరక్షకమగును. అట్టివానికి ఎట్టి భయమునులేదు. అశాస్త్రీయ ఘోరవిధానము నవలంబించి దంభాహంకార సంయుక్తులై వర్తించువారు ఆసురనిశ్చయులు. ఈ గుణభేదమునుబట్టి ఆహారము యజ్ఞము తపము దానము త్రివిధముగానుండును. వాని ఫలమును త్రివిధముగ సంపన్న మగును. మానవ ప్రవృత్తి చక్కబడుటకు మార్గద్వయము నిర్దేశింపబడును. ఒకమార్గము స్వీకార్యము. వేరొకమార్గము పరిత్యాజ్యము. ఆసురమార్గము పరిత్యజింపవలసినదిగా దైవము స్వీకరింపబడవలసినదిగా నిర్దిష్ట మగుచున్నది. అట్లే తామస రాజస శ్రద్ధలు నిరూపితములైనను పరిత్యాజ్యములుగా చెప్ప బడుచున్నవి. కేవల సత్వసంపదలోకూడ పరిత్యాజ్యములును కలవు. సాత్త్వికమే స్వీకారము.

### 83. ఓంతత్సదితినిర్దేశః 17-23

సర్వవిశ్వమునకును అనాదిపరబ్రహ్మ మూలకారణము. అదియే విశ్రాంతిస్థలము. ఆతని నామమొక్కటియే. కాని అది మూడువిధములనున్నది. వాస్తవముగా పరబ్రహ్మకు ఏ నామమునులేదు. ఏ జాతియులేదు. ఈమాయాజనితమైన

మోహాంధకారమందు పరబ్రహ్మకొక కల్పనయున్నది. కాబట్టి నామముంచబడుచున్నది. బాలుడు పేరుతో పుట్టుటలేదు. అనంతరము నామము కల్పితమగుచున్నది. సమయవిశేషము ననుసరించి నామభేదమున్నది. ఏయే నామముతో భగవాను నుద్బోధించినను భక్తుల నాతడనుగ్రహించును. బ్రహ్మతత్వ మును బోధించునట్టి మంత్రములుకలవు అవి ఉపనిషత్తాత్పర్య రూపములు. సర్వమంత్రములకును అధిపతియైన ప్రణవమీ నామమునకు మొదట కూర్చబడుచున్నది. అదియే ఓమ్ అను వర్ణము. తత్ సత్ అనునవి అనంతర వర్ణములు. ఈమూడును బ్రహ్మనామములు. ఉపనిషత్తులన్నియు ఈ సుందరపుష్పము యొక్క పరిమళములు. ఈమూడువర్ణముల సమాయోగమున పరబ్రహ్మనామము సిద్ధమగుచున్నది. తద్వినియోగము తెలియ తగినది. యజ్ఞ దాన తపః క్రియలు ఓంకారముతో ప్రారంభింపబడుచున్నవి. మోక్షకాంక్షులగువారు యజ్ఞాదిక్రియల లోని ఫలమును తమదిగా తలచక తత్పదమున పరమాత్మ నుద్దేశించి సమర్పించుచున్నారు. సద్రూపమందును సాధుభావ మందును ప్రశస్తకర్మయందును సత్ పదము చెప్పబడుచున్నది. సదాత్మకమైన పరమాత్మకు సంబంధించిన కర్మయు సత్ అనియే చెప్పబడుచున్నది. అశ్రద్ధాసమర్పితము అసద్రూపము. దానివలన ఫలములేదు. అసత్కర్మవలన ఇహపరములు నశించు చున్నవి కాబట్టి ప్రతివిధానమందును ఓం తత్ సత్ అను నిర్దేశ మును భావనచేయుచు పాటించుట సముచితముగానున్నది.

## 84 యజ్ఞదానతపఃకర్మనత్యాజ్యం 18-5

యజ్ఞము దానము తపస్సు ఏతద్రూపమైనకర్మ మెన్నడును పరిత్యాజ్యముకాదు. అవశ్యము వానిని మానవుడాచరింప వలయును. అవి మానవులకు ఫలప్రదములు. సంగరహితుడై వాని నవశ్యమాచరించవలయును. కర్మసన్యాసము కర్మత్యాగము అనువిధానములురెండు కలవనికొందరు తలంతురు అట్లు తలచనక్కరలేదు. సన్యాసము త్యాగమును ఒకటియే ఆ రెండిటికిని అర్థ భేదములేదు. కొందరనేకవిధముల తలచవచ్చును. కామ్యకర్మల త్యజించుట సన్యాసమందురు. కర్మల నాచరించినను ఫలత్యాగముచేయుట త్యాగమందురు. దుష్టకర్మ త్యక్తవ్యమందురు. యజ్ఞదాన తపస్సులు ఎప్పుడును త్యాజ్యములు కావందురు. త్యాగము కాని సన్యాసము కాని త్రివిధము గుణభేదమునుబట్టి త్యాగసన్యాసములందును త్రైవిధ్యముకల్గుచున్నది. దేహధారియగువాడు సర్వాత్మనా కర్మలను త్యాగము చేయజాలడు. కర్మసంగమును విడచిఉండుటయే త్యాగమనబడును. రాజసతామసములైన త్యాగములను స్వీకరించక సాత్వికమైన పద్ధతి స్వీకరింప వలయుట. యజ్ఞకర్మ, దేవతలతోటి మానవులకు సంబంధముకలుగ చేయునవియైయున్నవి. దివ్యసంబంధమున మానవున కట్టి విధానమపేక్షితము. తద్విధానమువలననే వికాసముకలుగవలయును. కావున యజ్ఞముత్యాజ్యముకాదు. దానకర్మ మానవులతో సంబంధము నాపాదించునదిగానున్నది. మానవసంబంధము నాపాదించి సమరసయోగమును సంపాదించినప్పుడు

మానవుని మానవత్వము వికాసముపొందును. తపఃకర్మ మానవునకు ఆధ్యాత్మికమైన విధానము. శరీరమందలి ధాతువులను ఇంద్రియములను వృత్తులను సంస్కరించి సముచితాత్మసంబంధమును సంపాదించునదిగానున్నది. కావున వీనిని ఆచరింపక పోవుటలో దైవికముగా సాంఘికముగా ఆత్మికముగా హాని కల్గును. కావున అవశ్యము వానినాచరింపవలయును.

## 85 త్రివిధం కర్మణః ఫలం 18–12

కర్మ సామాన్యమునకు ఫలమున్నది. ఆఫలము వేరొకలోకమున వేరొక దేహమున వేరొక కాలమున అనుభవింపబడునది అగును. తానాచరించిన కర్మలకు ఫలము తా నుద్దేశించినట్లే ఉండుననుకొనుట పొరపాటు. ఒకప్పుడనిష్టఫలము కలుగవచ్చును వేరొకప్పుడాఫలము ఇష్టానిష్టము కావచ్చును. యజ్ఞాది కర్మలను విడువక తమ గుణస్వభావము ననుసరించి ఆచరించుచు ఫలమునుమాత్రము త్యాగము చేయునప్పుడు జీవితానంతరమునందు ఫలము సంబంధించును. కర్మల సన్యసించువానికి అది ఏమియు కల్గదు. కర్మఫలమందు మూడు ప్రకారము లున్నవి. బుద్ధి విషయములతో అంకితమైనప్పుడు జీవుడు ధర్మముతో ప్రవర్తించి దుష్టకర్మలందు సక్తుడగును. తత్ఫలముగా ఆతడు కృమికీటాదినీచశరీరమును పొందును. ఇది అనిష్టఫలము. స్వధర్మాచరణము కలిగి తన అధికారదృష్టిని నిరీక్షించుచు వేదశాస్త్ర నియమానుసారముగా పుణ్యకర్మాచరణ చేసినప్పుడు ఇంద్రాది దేవోత్త

ముల ఉత్తమ శరీరప్రాప్తి కలుగును. ఇయ్యది ఇష్టఫలము. పరస్పర విరుద్ధరసముల సంబంధములో విజాతీయమగు రస ముత్పన్నమగునట్లు సుగంధ దుర్గంధ పుష్పద్వయ సమ్మర్దమున విజాతీయ ధర్మముదయించునట్లు సత్యాసత్యములు రెండును కలసి విచిత్ర పదార్థసముత్పాదముచేయును. శుభాశుభ ఫల మిశ్రణమువలన మనుష్యదేహము సంప్రాప్తమగుచున్నది. ఇది కర్మల మిశ్రఫలమని తెలియవలయును. ఫల విభాగ మీ విధముగనున్నను కేవలానిష్ట ప్రాప్తిలో అజ్ఞుడుకాక పరమేష్ట ప్రాప్తిలో మదాంధుడుకాక ఇష్టానిష్ట ఫలానుభవమందు ఉభ యసామరస్యమును తెలుసుకొనుచు పరమేశ్వరానుగ్రహ పాత్రుడు కావలయును.

86 కర్మాణిప్రవిభక్తానిస్వ భావప్రభవైర్గుణైః 18-41

గుణతత్వమును విడిచినదేదియులేదు. అన్నిటియందును సత్వర జస్తమస్సుల సంబంధ మేదోవిధముననున్నది. కర్తలో కర్మలో సాధనములో క్రియలో గుణము ననుసరించిన భేదమున్నది. గుణభేదమున జ్ఞానమును భిన్నమగుచున్నది. ధృతి, బుద్ధి, గుణభిన్నములగుచున్నవి. సుఖమందును సాత్వికాది భేదము న్నది. పృథివిలోకాని స్వర్గమునకాని మరియే స్థలమునకాని ప్రకృతి జన్యములైన ఈ మూడు గుణములతో కూడుకొననిది యేదియులేదు. మహావిశ్వమంతయు గుణమయము. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు శూద్రాదులకును ప్రాగ్జన్మములోని స్వభావ ప్రభూతములైన గుణవిశేషమునుబట్టి ఆయాకర్మలు

విభక్తములై యున్నవి. పూర్వజన్మ సంస్కారవశమున పరమే శ్వరానుగ్రహమున ఉత్తమ విధానము సంప్రాప్తమైనప్పుడు తగిన పద్ధతిని అవలంబించుట ఉచితము. అట్లుకాక అనుష్ఠా నాచరణము లేకపోయినచో అధమాధమమగుస్థితికలుగవచ్చును. మహాపతనము కలుగవచ్చును. స్వభావ సంసిద్ధములైనట్టి ఉత్తమ విధానములను సూక్ష్మ దృష్టితో అవగాహముచేసి కొనవలసియున్నది. ద్విజులకు ద్విజేతరులకును స్వభావసంసిద్ధ ములైన ఆయా విధానములు అత్యంతమనుసరింపతగినవి. అట్లు కాక మానవుడు విరుద్ధ గామియైనచో ప్రాప్యము సిద్ధము కా జాలదు. ఏకక్రియాసాధనమునకు అనేకావయవము లుపయు క్తములగును. వానిలో తారతమ్యములేదు. స్వస్వధర్మ మందు అవి నియతములు. నియతిని విడనాడి వైషమ్యమాపా దించుట హానికరము. స్వస్వకర్మాభిరతితో ప్రవర్తించుచు ధన్యత్వమును పొందవచ్చును. స్వభావసంసిద్ధములైన ప్రవిభక్త కర్మలుఅవశ్యముగా పరిపాలింపతగినవి. స్వస్వకర్మ నిరతి, సిద్ధిని సంపాదించును. సర్వకారణుడైన పరమేశ్వరుని నియతకర్మతో నారాధించుటయే సముచితపక్షము. దానివలన భగవానుడు పరితృప్తిని పొందును.

## 87. శ్రేయాన్ స్వధర్మో విగుణః 18-47

మానవబుద్ధి విచిత్రము. స్వవిశేషమును పరిశీలించుకొనక అన్యసంగతుల నొకప్పుడు ఆలోచించుట ఉండును. అట్టి సమయమున స్వభావరహస్యము తెలియదు. ఇతరతత్త్వము

ఆపాతమధురమై భాసించును. అప్పుడు స్వధర్మవైరస్యము ఇతర ధర్మాసక్తి కలుగవచ్చును. అది ఉచితముకాదని ఈ సూత్రము చెప్పుచున్నది. విగుణమైనను తన ధర్మమే శ్రేయస్కరము. ఎంతగా నాచరించినప్పటికి పరధర్మము పరధర్మమే. దానివలన అభీష్టఫలము కలుగదు. స్వభావనియతమగు కర్మాచరణము కిల్బిషమును హరించును. సహజ కర్మదోష సహితమైనను పరిత్యజింపతగినదికాదు. మోక్షము పొందవలయునని ఇచ్ఛగల్గి ప్రయత్నించు మానవునకు స్వధర్మాచరణము అత్యుత్తమము. ఆతని భావిజీవితమునకు ఆనుకూల్యమెట్టిదో తన కన్న తన గురుపాదులు చక్కగా నెరుగగలరు. అంతకన్నను నిర్మాతలయిన పరమేశ్వరుడే విజ్ఞాత. ఆతడు దయామయుడు. ఎట్టి విధానమున సాధకుడు తరించుట కవకాశమున్నదో దానిని పరమేశ్వరుడు ముందుగనే భావించి మానవుల నిర్మాణించి యున్నాడు. దివ్యభావము మానవులకు గోచరముకాదు. పరమేశ్వరభావమును పశువృత్తిలోనుండు మానవుడు తెలియజాలడు అందువలన అధిక్షేపించుట ఉచితముకాదు. పూర్వసముపార్జిత పుణ్యపాకానుగుణముగా జన్మకలుగుచున్నది. కర్మలునియతములైనవి. ఉత్తమభావము లక్ష్యముగా చేసికొని తనతన కర్మలతో పరమాత్మ నారాధింప వలయునని భగవానుని ఆశయము.

## 88 మచ్చిత్తః సతతంభవ 18-57

భక్తుడగు మానవుడు పరమేశ్వరుని తెలియగలడు. స్వధర్మపరిపాలనములో ప్రజ్ఞను సంపాదించినప్పుడు పరమేశ్వరనిష్ఠ

ఉదయించును. తదనుసారముగా వాక్కాయమనస్సులను నియమనముచేసి వైరాగ్యమునుపొంది ధ్యానయోగపరుడై మమాహంకారముల పోదోలి శాంతుడై బ్రహ్మభూయమునకు యోగ్యుడగును. బ్రహ్మభావములో శోకమోహములు లేవు. కర్మారాధనవలన చిత్తనిర్మలత ఉదయించును. అప్పుడు పరమేశ్వరస్వరూప శోభాసంపదలు గోచరములగును. పరమేశ్వర భావము భాసింపగనే సర్వభూత సమదృష్టి ఏర్పడును. నిరంతరము నిధ్యానముదయించును. మనస్సు పరమేశ్వరుని వైపునకు ప్రవహించునదియగును. అదియేభక్తి. ఆ భక్తి ప్రభావమున శ్రీకృష్ణతత్త్వము గోచరముకాగలదు. భగవానుని అనుగ్రహము సంసిద్ధమగును. అజ్ఞానము సంచ్ఛిన్నమగును. జ్ఞానముదయించును. ఆత్మసంవేదనముకలుగును. సామాన్య భావములో తనకుగల ప్రతిబంధరాశిని మానవుడు తనంతటతాను పోగొట్టుకొనజాలడు. దానికొఱకై భగవానుని అనుగ్రహమపేక్షితము. భగవదీయమగుకర్మలను ఆరాధింపవలయును. మనోనియతితో సర్వకర్మలను అకర్మరూపమైన భగవానునియందు సన్యసింపవలయును. బుద్ధియోగము నాశ్రయించి భగవంతునియందే చిత్తమును సంలగ్నము చేయవలయును. ప్రపంచమంతయు చైత్రికము. చిత్తమునంతను భగవదాకారాకారితము చేయవలయును. భగవచ్చిత్తునకు భగవదనుగ్రహము కల్గును. అదియే తరణోపాయము. దానివలన ఆత్మసంసిద్ధికలుగును.

## 89. తత్రశ్రీః 18-78

శ్రీకృష్ణభగవానుడు యోగీశ్వరుడు. ఆతడు సర్వతీర్థముల ప్రోవు. సర్వపుణ్యస్థలముల నిధానము. ప్రాపంచిక విలాసము నభిలషించి భగవానుని సేవించువానికి సులభత్వము సూచింపబడుచున్నది. సర్వాధిక సంపద్రూపమైన భగవానుని దివ్యభావము నిరవధికమైన చిత్రవిచిత్రమగు ప్రపంచశోభను సంపాదించును. అపారమగు విజయము అనంతమగుభూతి అన్నియు అచట నిశ్చితములగును. లోకసంగ్రహము సంపాదించునట్టి నీతిసంపదయు అచటనేయున్నది. ఇవి యన్నియు శ్రీపద వాచ్యములు.

## 90. తత్రశ్రీః

మానవునకు మోక్షమభిలషితము. అదియే పరమావధి. ప్రపంచవిలాసమే ఆధ్యాత్మికదృష్టికి మోక్షసామ్రాజ్యమగును. ఆనందైక నిధానమగు ఆత్మసామ్రాజ్యము ప్రపంచభానము పోగా అవభాసించును. ఏకరూపసూత్రావృత్తి సర్వాభేదమును చెప్పును. ఆత్మ శ్రీ ప్రాప్తి మహాలక్ష్యముగా ఆనంద ధామమున ఉన్నది.

---

భారతీ ప్రెస్, తెనాలి.

# సంశోధన

| పేజీ-పంక్తి. | |
|---|---|
| 2-14 | తమశ్ఛాయలు |
| 2-20 | శాసింపుము |
| 3-18 | తితిక్షస్వ |
| 4- 4 | అభ్యాసపథమందు |
| 4-10 | ద్వంద్వభావము |
| 4-13 | తితిక్ష |
| 7-19 | ఆవృతిప్రభా |
| 7-20 | ఖేదము |
| 8- 2 | అదృష్టి |
| 9- 6 | విజ్ఞానప్రవణత |
| 10-22 | వేదవాదముల |
| 15- 6 | భాజనుడగును |
| 15-16 | జీవుడుభ్రాంతుడైనాడు |
| 17-11 | ప్రవర్తించుట ఉచితము |
| 20- 2 | శ్రేయఃప్రదము |
| 20- 9 | చున్నచిరాభ్యస్త |
| 20-19 | ధర్మము విగుణము |
| 20-21 | ధర్మానుష్ఠానము |
| 21- 1 | కొంతటిస్వీకారము |
| 21- 8 | ప్రజహి |
| 21- 9 | ధర్మమున న్యూనాధిక |
| 21-10 | అందుహేతువు |
| 22- 3 | నిష్కామమున |
| 24- 5 | భాసించు |
| 24-19 | కర్మయనబడును |
| 27-19 | విస్తృతములై |
| 28-12 | పరిపూతమై |
| 29-18 | నిర్ణయము |
| 30- 6 | ఆ విజ్ఞానము |
| 30-19 | మందును |
| 32-21 | అవశ్యము |
| 38- 2 | అవిశేషముగ |
| 50- 8 | దురుపపాదము |
| 52- 2 | భేదము |
| 57-16 | గౌణభక్తిలో |
| 59-19 | పరమేశ్వరుని |
| 59-21 | అశ్రద్ధధానులగు |

---

ఈ గ్రంథకర్తగారి రాబోవు గ్రంథములు

భక్తి తంత్రము

శ్రీమాధవ గీత

తత్వ సంగ్రహము

☞ పుస్తకాలు అన్ని పుస్తకాలషాపులలోను దొరుకును.